ఆర్యవిజ్ఞానం—౨
రెండవ భాగము ప్రారంభం

ప్రచురణం - ౧౪

# కలియుగరాజ వంశములు

గ్రంథకర్త అండ్ ప్రకటనకర్త:
**కోట వెంకటాచలం**
గాంధినగరం :: విజయవాడ — 2

అద్వైతబోధినీ, నిర్విచార జీవనం, బ్రహ్మాండసృష్టి విజ్ఞానం, మానవసృష్టివిజ్ఞానం, కలిశకవిజ్ఞానం, ఆభాసశాస్త్రిస్తవం, ఆంధ్రు లెవరు? జంబూద్వీపం, ధృవనివాసఖండనం, భారతీయశకములు, గుప్తరాజు లెవరు?, అగ్నివంశపు రాజులు, అశోకుని కాలము ఇత్యాది గ్రంథముల గ్రంథకర్త:

వికృతిసంవత్సర మార్గశిర మాసము
కలి 5051 క్రీ. శ. 1950 డిశంబరునెల



*

ప్రథమముద్రణ
1000 ప్రతులు

వెల: 1-0-0

# కలియుగ రాజవంశములు

## అంకితము

భారత దేశాభ్యుదయ కాంక్షగల

సత్పురుషుల కందరకు

కలి 5051 మార్గశిర శుద్ధ సప్తమి

కోట వెంకటాచలం
గ్రంథకర్త

# విషయసూచిక




| వరుస నెం. | విషయము | | పుట |
|---|---|---|---|
| 1. | బార్హద్రథ వంశము | ... | 1 |
| 2. | ప్రద్యోతవంశము | ... | ,, |
| 3. | శిశునాగవంశము | ... | ,, |
| 4. | నందవంశము | ... | 2 |
| 5. | మౌర్యవంశము | ... | ,, |
| 6. | శుంగవంశము | ... | 3 |
| 7. | కాణ్వవంశము | ... | ,, |
| 8. | ఆంధ్రశాతవాహనవంశము | ... | ,, |
| 9. | గుప్తరాజులు | ... | ,, |
| 10. | ప్రమరవంశము | ... | 6 |
| 11. | మహమ్మదీయ, మహారాష్ట్ర, బ్రిటిషు | ... | ,, |
| 12. | కలియుగ రాజవంశావళి కాలము సప్తర్షి మండలచలనము ననుసరించి | ... | 7 |
| 13. | ప్రసిద్ధ చారిత్రక కాలములు | ... | 18 |
| 14. | అవతారముల కాలములు | ... | 23 |
| 15. | షట్చక్రవర్తులు | ... | ,, |
| 16. | గతించిన ప్రాచీన ప్రసిద్ధరాజుల కాలములు | ... | 24 |

# అనుబంధము


| | | | పుట |
|---|---|---|---|
| 17. | అగ్నివంశపు రాజులు | ... | 25 |
| 18. | ప్రమరవంశపు రాజులు | ... | ,, |
| 19. | చయహానివంశపు రాజులు | ... | 17 |
| 20. | శుక్ల లేక చాళుక్యవంశపు రాజులు | ... | 28 |
| 21. | పరిహారవంశపు రాజులు | ... | ,, |
| 22. | వైశ్యవంశపు రాజులు | ... | 29 |
| 23. | పల్లవ, శక, కుషాను, హూణరాజులు | ... | 30 |
| 24. | డిటో రాజుల వివరములు | ... | 31 |


*

# శుద్ధపత్రము

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 1 | 23 | భ్యదికానితు | భ్యధికానితు |
| 2 | 4 | 9 రాజులు | 2 రాజులు |
| 4 | 10 | 9 | 2 |
| 8 | 16 | ఈ గ్రంథం | భారతీయ శకములనెడి గ్రంథం |
| ,, | ,, | లోగడ | లోగల |
| 24 | 19 | 76 | 4 |

[ప్రఖ్యాత చరిత్రవేత్తలగు మహా మహోపాధ్యాయ, కళా ప్రపూర్ణ శ్రీ చిలుకూరి నారాయణరావు పంతులుగారు యం.ఏ. పి. హెచ్. డి. యల్. టి., అనంతపురం, గారిచే వ్రాయబడినది.]

ఇంతవరకును భారతదేశ చరిత్ర నిర్మాణము పాశ్చాత్యుల వ్రాతల కనుకరణముగా మాత్రముండి అదియే మన విద్యాలయము లలో విద్యార్థులకు బోధింపబడుచుండుటచేతను, చరిత్రను బోధించు ఉపాధ్యాయులు చరిత్రను గ్రుడ్డిపాఠముగా బోధించుచుండుట చేతను తాము బోధించు విషయములనుగూర్చి తగిన విమర్శలేక గతానుగతిక ముగా చరిత్ర విద్యాబోధ సాగుచుండుటచేతను సత్యమైన దేశచరిత్ర మనకింకను లభింపలేదు. ఇంగ్లీషు డిగ్రీలను సంపాదించిన విద్యాధికులు తగిన పరిశీలనలేక వ్రాసిన పాఠ్యచరిత్ర గ్రంథములే ఉపాధ్యాయులకాశ్ర యములగుచున్నవి. భారతదేశ చరిత్రనుగూర్చిన పరిశోధనలలో విద్యా ధికులైనవారు వ్రాసిన వ్రాతలలో పరస్పరపొందిక కానవచ్చుటలేదు. ఇది యిట్లుండగా చరిత్ర నిర్మాణమునకు వలయు మూలగ్రంథములు, శాసనాదికములుగాక అనాదిగా సంప్రదాయసిద్ధముగా వచ్చుచున్న పురాణములమీద దృష్టిని పాశ్చాత్యులు గర్హించి యుండుటచే వానిపై మన వారికిని ప్రమాణదృష్టి తప్పినది. అయినను ప్రాచీన గ్రంథముల నామూలాగ్రముగా పరిశోధించి అందలి సత్యములకును యితరాధారము లకును సమన్వయమును కల్పించి సిద్ధాంతముల నేర్పరుపగల ధీశాలులు ఆంగ్ల విద్యాధికులు కాని వారు దేశమున లేకపోలేదు. అట్టి వారిలో ఆంధ్రులలో అగ్రస్థానమును వహింపగలవారు బెజవాడ వాస్తవ్యులు బ్రహ్మశ్రీ కోట వెంకటాచలం పంతులుగారు. వీరితో నాకుమూడేండ్ల నుండియు దగ్గర పరిచయమేగాక స్నేహముకూడ నేర్పడినది. భారతీయ విజ్ఞానము, భారతీయులచరిత్ర, భారతీయుల సాంప్రదాయములను గురిం చిన సత్యములను లోకమున కెరుకచేయ వీరు చేయుచున్న కృషి అపా రము, అగాధమునైనది. పౌరాణిక విజ్ఞానమునంతటిని అవలోడనముచేసి మనకు పాఠకులకు సులభముగా అవగాహన మగునట్లు శ్రీ వెంకటా చలంగారు వ్రాసిన కలికక విజ్ఞానము మూడుభాగములు, ఆంధ్రులెవరు? ఆర్యుల ధృవనివాసఖండనము, మానవసృష్టి విజ్ఞానము మొదలయిన గ్రంథములను చదివి ఆనందించగల భాగ్యము నాకు లభించినది.

శ్రీ వెంకటాచలంగారు పర్గీటరు వ్రాసిన "The dynasties of the kali Age" అను గ్రంథములో తెలియక చేసిన పొరబాట్లనేకములను సవరించి పర్గీటరు తానాధారపడిన ఆ పురాణములనుండియే సరియైన భాగముల నుద్ధరించి చక్కగా వ్యాఖ్యానించి పర్గీటరు చేసిన ప్రమాదభూయిష్టములైన నిర్ణయములను సవరించి సత్యమును ప్రకటింపగలిగిరి. కలిశక విజ్ఞానమును సమస్తాంధ్రులును పఠించి తీరవలయునని నా అభిప్రాయము. అట్లే మనము నివసించు జంబూద్వీప విభాగ నిర్ణయంలో శ్రీవారు చేసిన నిర్ణయము సర్వథా శ్లాఘ్యముగా నున్నది. ఆంధ్రులెవరు? అను వ్యాసము యింతకు పూర్వము చరిత్రకారులందరును త్రొక్కిన త్రోవను ద్రొక్కక క్రొత్త దృక్పథమును వెల్లడించుచున్నది. ఆంధ్రుల నిజస్వరూప మిట్టిదని శ్రీ వెంకటాచలంగారీ గ్రంథమున నిరూపించిరి. ధృవనివాస ఖండనమను గ్రంథము శ్రీ తిలక్ గారు రచించిన "The Arctic Home" అను ఇంగ్లీషు గ్రంథములోని విషయమునకు సప్రమాణమైన విమర్శనమై యున్నది. శ్రీ తిలక్ గారి గ్రంథములోని పాండిత్య విలంబనమునకు వేదవిజ్ఞానపు లోతు తెలియని పాశ్చాత్యపండితులు ముగ్ధులై జేజేలు పెట్టుచుండ అది కాదని అనేక ప్రమాణములతో నిరూపింప సాహసించి నిలిచిన ధీరులింతవరకును శ్రీ వెంకటాచలంగారొక్కరే. "భారతీయశకము" లనెడి యీ గ్రంథము చరిత్ర నిర్మాణమున కత్యంతోపయుక్తమైనది. వివిధ శకకాలములలో యిదివరకుండిన పొరబాట్లను చూపుచూ సరియైన కాలనిర్ణయములు సప్రమాణముగా యిందు నిరూపింపబడినవి. లోకములో ప్రబలముగ వ్యాపించిన అసత్య సిద్ధాంతముల నరికట్టి సత్యచరిత్ర నిరూపణమునకు కంకణము కట్టిన శ్రీ వెంకటాచలంగారి పాండిత్య గౌరవ మసాధారణమైనదని చెప్పుట కెట్టి సందేహమునులేదు. ఈ ధోరణిలో శ్రీవారు వ్రాసిన గ్రంథము లెన్నియో గలవు. అవన్నియు నచిరకాలములో బ్రకటితములై ఆంధ్రులలో చరిత్ర విజ్ఞానవ్యాప్తికి తోడ్పడగలవని విశ్వసించుచున్నాను.

ఇట్లు,


అనంతపురము,
14-10-1950.

చిలుకూరి నారాయణరావు వ్రాలు
మహామహోపాధ్యాయ, కళాప్రపూర్ణ,
M. A. P. H. D. L. T.

WRITTEN BY :

M. R. Ry. R. SUBBA RAO PANTULU GARU,

M. A., L. T., M. E. S. (Retd.)

Hon. General Secretary,
Andhra Historical Research Society, Rajahmundry;
Author, History of Kalinga etc.,
Government Nominee, Madras Regional Indian Historical Records Commission; Head of the Department of History and Economics, Govt. Arts College, Rajamundry. (Retd.)

---

Manavasrishti Vijnanam or The Genesis of the Human Race by Sri Kota venkatachelam Garu of Gandhinagar, Vijayawada, is a work much-needed at the present moment when Research all-round is advocated by one and all in our New Free India, wherein Western ideas and theories propagated for over one and half centuries must yield place to our traditional lore based rightly on our most ancient and classical literature which has got to be read fully and interpreted correctly for the benefit of the world. The author has also written many more useful works on Arya Vijnanam.

Before writing about the abode of the Aryans and connected problems, he has done rightly in interpreting the several theories regarding God. His will or Maya or Prakriti and the body which is determined by Prakritior Nature. The union of purusha and prakriti and the process of creation and its age have been described in detail and the theory of Evolution based on our Shastras has been compared with certain theories put forward by Western scholars. The author has done very well in examining the writings of certain foreign writers and rejecting what is not supported by our Vedas and Shastras and other works accepting those in consonance with them. The statistics supplied are a welcome feature. The maps have enhanced the value of the work and brought home to our minds the correct position. The evidence of Geology noted by the learned author has received unexpected support from recent discoveries made and reported. For instance, Dr. B. N, Chopra, lately Offg. Director of Zoological Survery of India discovered recently a living fossil in a well at Banares and opines that its ancestors flourished in the Mesozoic period of Earth's history over a hundred million years ago and its representatives are found now in Australia, New Zealand, Tashmania, South

Africa etc., and its discovery in India proves the existence of Gondwana Land, when these countries along with South America and South Asia formed one big Southern land mass. Dr. Kennette E. Caster of Cincinatti University found fossils in rocks in South America of the Paleozoic Age states that and the opinions of scientists that they are only 250 millions of years old are to be revised as they are thought to have-existed more than 100 million years earlier, i. e, they must be more than 350 million years old. Based on the studies pursued by the Geologists, Aryavartha, according to the author, was the most ancient part of the Globe and it was inhabited at the end of the Azoic Age (i.e.) 195, 58, 85, 048 years ago. The Panchanga, based on Surya - Sidhanta, Vishnu Purana, Mahabharata, Manusmirti and Vedas must be fully and implicitly believed. The Maha Sankalpa and Nitya Sankalpa are devised to preserve our Age but we ere neglecting them. Like the Veda which has come down to us from mouth to mouth, the Sankalpa has also enabled us to know the Age of Creation.

In Part II of the work, the Author has described in detail the Genesis of the Aryans and it behoves every one to read it carefully. "Aryavartha is the place of the first Creation and the Aryan is the first man Created". The origin of Vedas and Shastras was in Brahmavarta. The account of Brahmarshi-desa, Madhyadesa, Aryavartha, Yajneeyadesa or Bharata Varsha, Sapta - Sindhu and other regions is correctly given. The views of Western writers on the subjects are carefully examined. For instance, the purity of Aryan Race, the necessity for caste system, the relations between the Aryans and the Dasyus, the Ancient Geography given in the Puranas and other problems which or of great practical value to us now are all examined in the light of what Western scholars wrote on the same - and are very authoritative. Conclusions which are thought - provoking but just and true are given by this learned author who has devoted a large part of his life for classical studies, wide travels and scholarly discoveries. His books must find a place in every Library, School and College. They are well written in an easy and reasoning style and their price is amazingly small. The statistics and maps have enhanced its value and the printing and get-up are excellent. We heartily congratulate the Author.

(Sd.) R. SUBBA RAO.

ఆర్షవిద్యాభూషణ, ఉపన్యాసకేసరి,

## శ్రీ జటావల్లభుల పురుషోత్తము, ఎం. ఏ.

[లెక్చరర్ యస్. ఆర్. ఆర్., సి. వి. ఆర్. కాలేజి విజయవాడ] గారిచే

వ్రాయబడినది

సుమారు 195 కోట్ల సంవత్సరముల కాలములో విస్తరించియున్న భారతదేశచరిత్రమును 4000 సంవత్సరములలో నిముడ్చుటకు పాశ్చాత్య పండితులు ప్రయత్నించుటచే కలిగినయనర్థము వర్ణనాతీతము. దానివలన మనవేదములు నిన్నమొన్నటివైనవి, రామాయణ భారతాదులు కల్పిత గ్రంథములైనవి; పురాణములు కట్టుకథలైనవి; హెచ్. జి. వెల్సువంటి విద్వాంసుడుకూడ క్రీ॥ పూ॥ 6 వ శతాబ్దివాడైన బుద్ధునితోనే భారత దేశ నాగరకత ప్రారంభమాయెనని వ్రాయుట తటస్థించినది. అలెగ్జాండరు దండయాత్రతోనే భారతదేశమునకు యవనసంబంధము కల్గిన దనియు, రామాయణ భారతాదులలో యవనులను గూర్చిన ప్రసంగము లన్నియు క్రీ॥ పూ॥ మూడవశతాబ్దికి తరువాతనే లిఖింపబడినవనియు విశ్వసింపబడజొచ్చెను; అశోకుడు యవనాది రాజులను తన శాసనము లలో పేర్కొనుటచే నాతనికాలము అలెగ్జాండరునకు తరువాతి దనునది దృఢసిద్ధాంతమువలెనే స్థాపింపబడినది; ఆతని తాతయగు చంద్రగుప్త మౌర్యుడే అలెగ్జాండరును కలసికొన్న శాండ్రకోటస్ అని నిశ్చయింప బడెను.

ఈయపసిద్ధాంతముల నన్నిటిని ఖండించుచు యథార్థమైన భారత దేశచరిత్రను నిరూపించుచు **శ్రీ కోట వెంకటాచలముగారు** ఇది వఱకు 12 గ్రంథములను లిఖించియున్నారు. ఇది 13 వ గ్రంథము. ఇందు అశోకచక్రవర్తి కాలము క్రీస్తుకు పూర్వము 1472–1436 అని నిర్ణ యింపబడినది. ఇదికూడ వీరి ఇతరగ్రంథములవలెనే బహు ప్రమాణ విలసితమై నిరుత్తరములగు యుక్తులతో కూలంకష విమర్శపాటవ విరాజితమై చారిత్రకగ్రంథములలో నగ్రశ్రేణి నలంకరించుచున్నది. ఈ గ్రంథము తెలుంగుభాషలోనే యున్నను యావద్భారతీయులేకాక ప్రపంచములోని చరిత్రశ్రద్ధాళువు లెల్లరు గమనింపదగిన యంశములతో నిండియున్నది. భారతచరిత్రలో అశోకున కట్టిప్రాముఖ్యము కలదు. అలెగ్జాండరును కలసికొన్న చంద్రగుప్తుడు గుప్తవంశస్థుడనియు, మౌర్య

చంద్రగుప్తుడు క్రీ॥ పూ॥ 1500 సంవత్సరముల క్రిందటివాడనియు శ్రీ వెంకటాచలముగారిదివఱకే కొన్ని గ్రంథములలో నిర్ణయించి యుండుటచే అశోకునికాలము క్రీ॥ పూ॥ మూడవశతాబ్ద మనువాదము నకుగల పునాదిని వారిదివఱకే పెఱకివైచినారని చెప్పవలయును. గ్రీకుల శాంద్రకోటస్ సంద్రగుప్త మౌర్యుడు కాడని యితర చారిత్రకులుకూడ కొందరు వ్రాసియున్నారు. దానిని వీరు ధ్రువపఱచినారు.

అశోకుని శాసనములలో నాతని సమకాలికులుగా పేర్కొనబడిన రాజులు కొందరు క్రీ పూ॥ 3 వ శతాబ్దిలో సిరియా, ఈజిప్టు, మాసిడో నియా, సిరినీ, ఎపీరసు దేశములను పాలించిన వారేయగుటచే అశోకుని కాలము కూడ క్రీ॥ పూ॥ 3 వ శతాబ్దమేయని పాశ్చాత్య చారిత్రకులు వ్రాసినారు కాని వారు తమవాదమున కనుకూలముగా పేర్ల నెట్లు మార్చుకొనవలసివచ్చినదో యనునది ముఖ్యవిషయము. అంటియోఛస్ అను పేరే శాసనములో అంతియోకో అని యున్నదనియు, టాల మియే తురమయగా చెప్పబడినాడని, అంటిగోనసే అంతికిని ఆయె ననియు, "మగాస్" మగయాయెననియు వీరి వాదము. ఇంతకును శాస నములో నున్నట్లు చరిత్రకులచే చెప్పబడినపేర్లు కొన్ని యారీతిగా లేనే లేవని శ్రీ వెంకటాచలముగారు నిరూపించుచున్నారు. ఏదోవిధముగా అశోకుని క్రీ॥ పూ॥ మూడవ శతాబ్దిలో ఇరికించుటకై పాశ్చాత్య చారిత్రకులీ పాట్లుపడినారని వీరు చెప్పుదానిలో సత్యమున్నట్లు నిష్పాక్షిక పాఠకులకు తోచగలదు. ఈ భావము పాశ్చాత్య చరిత్రకులకే కొంద రకు గల్గినదనునది గమనింపదగిన విషయము. ఈ చరిత్ర నిర్మింపబడు చుండిన కాలములోనే కొందరీ భావమును కన్పఱచినారు. Journal of the Asiatic Society of Calcutta అను ప్రఖ్యాత పత్రికలో నీ యభిప్రాయము వెల్లడింపబడినది.

అశోకుని కాలమునాటికి గ్రీసుదేశపు జాడలే లేకుండెనని శ్రీ వెంకటాచలముగారి యభిప్రాయము. క్రీ.పూ. 800 ప్రాంతముననే గ్రీసు చరిత్ర ప్రారంభమాయెనని గ్రీకులే చెప్పుకొనియుండగా క్రీ. పూ. 15వ శతాబ్దినాటి అశోకునికాలములో నీ దేశప్రసక్తి కవకాశము లేదని వేరుగ చెప్పనక్కఱలేదు. అట్లయినచో అశోకుడు యవనాది దేశములను పేర్కొనుటె ట్లు పొసగునను ప్రశ్న రానచ్చును. దీనికి శ్రీ వెంకటా

చలముగారిచ్చిన సమాధానము చారిత్రకారులకు క్రొత్త వెలుగును చూపు నదిగా నున్నది. యవన రాష్ట్రము, హూణ రాష్ట్రము మున్నగునవి భారత దేశములోనే యున్నవని వారి సిద్ధాంతము. వారు దానిని సమర్థించుచు చూపిన ప్రమాణముల సెవ్వరును కాదనజాలరు. పటముచే వారా యా దేశములను నిరూపించియున్నారు. గ్రీసుకు యవనదేశమను పేరు వచ్చుటకును, యూరపులో కొంత భాగమునకు హూణ దేశమను పేరు వచ్చుటకును, చీనా దేశమునకా పేరు గలుగుటకును గల కారణములను వారు చూపియున్నారు. భారత దేశములోని యవన, హూణ, చీనాది నామములు గల క్షత్రియ శాఖలు ఇక్కడ నుండగానే ఏ రీతిగా ధర్మభ్రష్టులైపోయినదియు వారు పౌరాణిక చారిత్రకాంశముల మూలమున నిరూపించిరి. వీరితర దేశములకు పోయి పూర్తిగా వర్ణాశ్రమ ధర్మ భ్రష్టులైపోయినట్లు గ్రంథకర్తలు చేసిన నిర్ణయము మనుస్మృతిలోని

"శనకైస్తు క్రియాలోపాదిమాః క్షత్రియ జాతయః
వృషలత్వం గతాలోకే బ్రాహ్మణాదర్శనేనచ"

అను వచనముచే బలపఱుపబడుచున్నది. స్మృతి పురాణ యుక్తులచే వీరు గావించిన నిర్ణయమునే సుమారు 80 సంవత్సరముల క్రింద పోకాక్ అను ఆంగ్లేయుడు ఇతరాధారములచే గావించియున్నాడు. ఆతడు "India in Greece" అను లోకోత్తర గ్రంథములో భారతీయు లెప్పుడెప్పుడు వలసపోయి ఈజిప్టు, గ్రీసు, బేబిలన్ మున్నగు ప్రదేశములను విజ్ఞాన సందీపితములను గావించినారో విచారించి యాయా దేశముల నాగరికతలు భారత దేశమునుండియే వెళ్ళినవని నిరూపించినాడు. నాటికి నేడు ధైర్యముగా, పాటవముతో నీ విషయమును సప్రమాణముగా, విపులముగా చర్చించినవారు శ్రీ వెంకటాచలముగారు మాత్రమే. భారతీయ యవన క్షత్రియులు వలసపోయి యాక్రమించుకొనుటచే గ్రీసుకు యవనదేశమను పేరు వచ్చెననియు, అట్లే చీనా, హూణాది దేశములకా పేరులు వచ్చెననియు వీరు నిరూపణము చేసియున్నారు. ఆదిలో యవనులు అను క్షత్రియ శాఖ యొకటి భారత దేశములోనే యుండెనను ఈ యొక్క సంగతిని మనము గుర్తింపనిచో రామాయణ భారత పురాణములలోని కథలు కొన్ని మనకు సమన్వయమే కావు

ఇచ్చట నొక సంగతిని పేర్కొనవలసి యున్నది. భారతదేశము నుండి యవనులు గ్రీసుకు వెడలినప్పటికి యూరపు దేశములోని ప్రజలు మిక్కిలి యనాగరక స్థితిలో నుండిరి వారును పిమ్మట గ్రీసులో తండోప తండలుగా చేరిరి. వారియనాగరిక స్థితిని పాశ్చాత్య చారిత్రకులే యంగీకరించిరి. వారాశ్చర్యపడిన దేమన: హోమర్ వ్రాసిన ఇలియడ్ అను గ్రంథములో పట్టణ నిర్మాణము, శిల్ప చాతుర్యము మున్నగు నాగరకాంశముల నున్నతస్థాయిలో నున్నవానిని ఇలియడ్ ప్రతిబింబింప చేయుచున్నది. ఇది యెట్లు సంభవించినదను ప్రశ్న చారిత్రకులకు కొంద రకు కల్గినది. ఇట్లు కల్గినవారిలో సుప్రసిద్ధ చరిత్రకారుడు "అనేటారి" యను పండితుడొకడు. ఆ సందేహమును శ్రీ వెంకటాచలముగారిప్పుడు తీర్చినారు. యూరపులో నెక్కడనులేని నాగరకతా విశేషమును గల్గిన ఆ యవనులే భారతదేశము నుండి వెడలినవారని వీరు నిరూపించినారు. రామాయణము చదివినవారికి "ఇలియడ్"లోని నాగరకత అంత యాశ్చ ర్యముగ తోపదు. అట్టి రామాయణ నాగరకత గల భారతీయులే గ్రీసులో నా విధమైన సంస్కృతిని కొంతకాలము నిలబెట్టుకొని ఇలియడ్ గ్రంథములో చిత్రించుకొనినారు. ఇట్లు పాశ్చాత్య చారిత్రకులకు గల్గిన పెద్ద సందేహమును మన గ్రంథకర్త విడగొట్టినారు.

ఈ రీతిగా శ్రీ వెంకటాచలముగారి యీ గ్రంథమును, ఇతర గ్రంథములును భారతదేశ చరిత్రకు నూతనసంస్కారము గావించునవిగా నున్నవి. క్రొత్తదారిని త్రొక్కినారను కారణముచే వీరి గ్రంథములను శంకింపవలసిన యావశ్యకతయు లేదు. యవనాది దేశములకు భారత దేశమునుండి ప్రజలు వలసవెళ్ళుటచేతనే యచట మానవా వాసము సంభవించెననియు, అదివఱకక్కడ మానవులే లేరనియు ప్రసిద్ధ చారిత్ర కులే కొందరు వ్రాసియున్నారు. శ్రీ వెంకటాచలముగారు భారతదేశ ములోనే మానవసృష్టి ప్రారంభమాయెనని వేదశాస్త్ర పురాణ ప్రమాణములచే నిరూపించి యున్నారు. కలకత్తా విశ్వవిద్యాలయ ములో ప్రొఫెసరుగా నుండిన శ్రీ అవినాశ చంద్రదాసుగారు భూగర్భ శాస్త్రమును (Geology) బట్టియు, ఇతరాధునిక శాస్త్రములను బట్టియు ఆదిమానవసృష్టి భరతఖండములోనే యాయెనని తమ Rig vedic India అను గ్రంథమున నిరూపించియున్నారు. ఈసిద్ధాం

తమును వినినంతనే త్రుళ్లిపడువారును ఇది భారతీయులదేశ దురభిమానమునుసూచించుననియు పలుకువారును కొందరుకలరు. ఆదిమానవసృష్టి ఆర్కిటిక్ ప్రాంతమున జరిగెననుటలో వీరికి త్రుళ్లిపాటురాదు. "కావచ్చును ఎక్కడనో యొకచోట ఆదిసృష్టి జరుగవలయునుకదా!" అని వారు సమన్వయించు కొందురు. ఆల్లే మధ్యఆసియాలో ఆదిమానవుడు సృజింపబడినాడన్నను వీరికి వెగటుగా కన్పట్టదు ఎక్కడను పుట్టినిచో మానవుడెట్లు భూలోకములోనికి వచ్చును? అని వీరు సరిపెట్టుకొందురు. కాని వీరిత్రుళ్లిపాటులు, వెగటులు భారతదేశము పేరెత్తినప్పుడే ప్రారంభమగును. నిజదేశము, స్వదేశీయ విజ్ఞానము వెగటుగతోచు నీ విపరీత పరిస్థితి 150 సంవత్సరముల బ్రిటిష్ పరిపాలన దుష్ఫలితములలో నొకటి.

ఈ మానసిక వికార మున్నంతకాలము మనకు శ్రీవెంకటాచలముగారి గ్రంథములవంటి సత్యప్రదర్శక గ్రంథములలోని ప్రాశస్త్యమును గుర్తించుశక్తికలుగదు. ఆవికారము తొలగుటకిట్టి గ్రంథముల పఠనము కారణముకూడ కాగలదు. జీవితమంతయు పాశ్చాత్య తదనుసారి చారిత్రకుల మార్గములలో గడపినచరిత్ర పరిశోధకులు కొందరింతవఱకు శ్రీవెంకటాచలముగారు ప్రచురించిన గ్రంథములనుజూచి "ఇందలి విషయములు కొట్టివేయదగినవికావు. భారతదేశ చరిత్రాన్వేషణములోనివి నూతనశకము ప్రారంభింప చేయుచున్నవి" అని మెచ్చుకొనినారన్నచో వీరి గ్రంథములే యేనాటికైనను భారతదేశ యథార్థచరిత్ర బోధకములుగా గుర్తింపబడగలవని యూహించుట కవకాశము కల్గుచున్నది. శ్రీ రాళ్ళబండి వెంకటసుబ్బారావు పంతులుగారు. డాక్టర్ చిలుకూరి నారాయణరావు పంతులుగారు, డాక్టర్ పట్టాభి సీతారామయ్య పంతులుగారు మున్నగువారు వీరిగ్రంథములనుజూచి ముగ్ధులైనారు. 80 సంవత్సరములనుండి చరిత్రపరిశోధకులేమార్గములో క్రమాభివృద్ధినొందుచు వచ్చుచున్నారో ఆ మార్గములోనే శ్రీ వెంకటాచలముగారు నాలుగడుగులు ముందునకు పోయినారనునది గమనింపదగిన విషయము.

ఏనాడో సర్ విలియంజోన్స్ పెట్టినభిక్షనే నేటికినిపట్టుకొని తృప్తిపడువారు కొందరుకలరు. ఆయన 170 సంవత్సరములక్రింద వేదములకు నిర్ణయించిన కాలమునే నమ్ముచు, దాని హద్దులలోనే భారతదేశ

చరిత్రనంతను ఇముడ్చుకొను దృష్టిగలవారు చరిత్రాన్వేషక పవిత్ర నామమున కర్హులుకారు. ఆ చారిత్రక సిద్ధాన్తము లెంతదుర్బలములో ఇటీవల ప్రబలముగా ప్రదర్శింపబడియే యున్నవి. వేదములు క్రీ॥ పూ॥ 2000 ప్రాంతమున పుట్టినవను సిద్ధాంతమెంత దుర్బలమైనదన : లోక మాన్య శ్రీ తిలక్ దానినొక త్రోపుత్రోయగా నది 2500 సంవత్సరములు వెనుకకుపోయి పడినది. ప్రొఫెసర్ జాకొబీ మున్నగు పాశ్చాత్య పండితులుకూడ తిలకుగారి మతమునే గల్గియుండిరి. శ్రీ అవినాశ చంద్ర దాసుగారింకను దానినెట్టగా 15 వేల సంవత్సరములు ఇంకను వెనుకకు పరుగెత్తిన దీ దుర్బలసిద్ధాంతము. ఇటీవల లక్నోయూనివర్సిటీలో నొక ప్రొఫెసర్ ఇంకను త్రోయగా నిది 80 వేల సంవత్సరము లింకను వెనుకకు పోయినది. ఇంత దుర్బల చారిత్రక సిద్ధాంతమును నమ్మికొని విజ్ఞానఖనులైన మన వేదశాస్త్ర పురాణాది గ్రంథములను నిరసించుట యనునది మనము చేసినమహాదోషము. శ్రీ వెంకటాచలముగారీ పైని తెలిపిన చారిత్రక సిద్ధాంతముల నింకను పరీక్షించి వీని యప్రా మాణికతను నిరూపించి వేదశాస్త్రపురాణ ఇతిహాసిక సత్యత్వమును ప్రబల ప్రమాణములతో నిరూపించి 195 కోట్ల సంవత్సరముల భారతదేశ చరిత్రను పునర్నిర్మించు మహోద్యమమును పూని తమ జన్మను సార్థకము చేసికొనుచు మనలో నూతన చైతన్యమును గల్గించుచు, మన పర ప్రత్యయనేయ బుద్ధి స్థానమున ఆత్మవిశ్వాసమును, అంధాను కరణస్థాన మున అన్వేషణశక్తిని, నాస్తిక్య స్థానమున ఆస్తిక్యమును నెలకొల్పుచు మనకు స్వరాజ్యము వచ్చిన 1947 వ సంవత్సరంలోనే వైజ్ఞానిక స్వరాజ్య సోపాన పరంపరనదగిన యీ గ్రంథ పరంపరను ప్రచురించుటకు ప్రారం భించి యీ వార్థకమున రాత్రిందివము కృషిచేయుచు భారత వైజ్ఞానిక జాతీయతా పునర్నిర్మాణమునకు ప్రథమ శిల్పి యనదగి యలరారు చున్నారు. వీరి యీ ప్రకృత గ్రంథము కూడ నితర గ్రంథములవలెనే యాంగ్ల విజ్ఞానాభిలాషుల కాశ్వాసహేతువై, సత్యాన్వేషకులకు కరదీపి కయై విలసిల్లగలదనుటలో సంశయలేశము లేదు.

ఇట్లు,

జటావల్లభుల పురుషోత్తము.

ఆర్యావర్తః — పుణ్యభూమిః

# ఆర్యవిజ్ఞాన గ్రంథమాల

## ఆంధ్ర మహాజనులకు విజ్ఞప్తి

ఆర్యులారా!

"ఆర్యవిజ్ఞానము" అను గ్రంథమును ప్రథమ భాగముగా 1800 పుటలకు పైగాగల ఎనిమిది భాగములు మాత్రము 13 పుస్తకములుగ యిప్పటికి ముద్రణము చేయింపగలిగితిమి. పాశ్చాత్య పండితులచే వ్రాయబడిన మనదేశచరిత్ర లనేక పొరపాటభిప్రాయములతో నిండి యుండిన యసత్య చరిత్రలని స్పష్టముగా రుజువుచేయబడినది. భారతీయ వాఙ్మయము నుండి యదార్థ విషయముల సేకరించి యుక్తియుక్తముగను సప్రమాణముగను, వ్రాయబడిన అత్యుత్తమ గ్రంథములు.

దేశములో ప్రముఖులును, వార్తాపత్రికలును, మా ఆర్యవిజ్ఞాన గ్రంథములమీద చక్కని సమీక్షలు చేయుచుండిరి. గ్రంథములను చదివినవారలు తమ హర్షామోదములను దెలుపుచుండిరి. ఇప్పటికి తొమ్మిదివేల రూప్యములకు పైగా ఖర్చుచేయబడినది. గ్రంథములమీద పెట్టబడినసొమ్ము వెంటనే తిరిగి యొకేమొత్తమున వచ్చునది కాదను సంగతందరెరింగినదే. ఇంకను ఎనిమిదివేల రూప్యములుండినగాని మిగత గ్రంథము లచ్చుకానేరవు. విజ్ఞాన తృష్ణగల ద్రవ్యవంతులు విరివిగా విరాళములిచ్చి పోషించినగాని మిగత భాగములు ముద్రింపబడజాలవు.

ఇరువది సం॥ కంటె నెక్కువకాలము అనేక గ్రంథ పరిశోధన జేయబడి ప్రాచీనవిజ్ఞానమును ఆధునిక ప్రకృతిశాస్త్రముల దృష్ట్యా సమన్వయించి యీతరమువారికిని, రాబోవువారికిని ప్రాచీనార్య విజ్ఞానము కరతలామలక మగునట్లు చేయుటయే యీ గ్రంథమాలలోని విశేషము. కాబట్టి భారతీయులందరు మా యుద్యమమునకు తోడ్పడి ఆర్యవిజ్ఞాన ద్వితీయభాగముద్రణమును పూర్తిచేయించ ప్రార్థన. ఇప్పటికి ముద్రణము పూర్తిచేయబడిన పదమూడు గ్రంథములుగల సెట్టు 1కి రు 27-0-0 లు కిమ్మతు అయినది. లోగడ పోషకులుగా జేరి రు 25-0-0 యిచ్చిన వారికా రు 27-0-0లు సెట్టంతయు యీయబడినందున వారి పోషకచందా తీరిపోయినది. ద్వితీయభాగముకుకూడ చందాదారులుగా చేరి తిరిగి రు 25-0-0 లు పంప ప్రార్థన.

# రెండవ భాగమునకు సహాయము

(1) మహారాజ పోషకులు రు 100-0-0 (2) రాజపోషకులు రు 50-0-0
(3) పోషకులు రు 25-0-0 లు

లోగడ ప్రథమభాగ ప్రచురణములో చేరి యుండినవారు తిరిగి రు 25-0-0 లు పంపిన రాజపోషకవర్గములో చేర్చబడి రాబోవు రెండవ భాగ గ్రంథములన్నియు పంపబడును. రెండవభాగమునకు మాత్రమే చేరి రు 25-0-0 లు పంపినవారు పోషకవర్గములో చేర్చబడి రెండవభాగ గ్రంథములు మాత్రం పంపబడును. ప్రథమభాగము సెట్టు వలయువారు రు 25-0-0 లు పంపిన గ్రంథములు బడయగలరు. ప్రథమభాగ గ్రంథముల సెట్లు కొనెడివారు రెండవభాగము ముద్రించుటకు సహాయపడిన వారగుదురని మనవి. ప్రథమభాగం చందా బాకీయున్నవారు వెంటనే పంప ప్రార్థన.

### తయారైన గ్రంథములు.

| | | |
|---|---|---|
| ౧. | బ్రహ్మాండ సృష్టివిజ్ఞానం | రూ 3-0-0 |
| ౨. | మానవ సృష్టివిజ్ఞానము (ఇం) | ,, 1-8-0 |
| 3. | కలిశక విజ్ఞానం (ప్ర భా.) | ,, 1-8-0 |
| ౪. | ,, (ద్వి భా.) (కలిరాజ వంశావళి) | 2-4-0 |
| ౫. | ,, (తృ భా.) (కలిరాజ వంశావళి శేషం) | 4-8-0 |
| ౬. | ఆంధ్రులు ఎవరు ? | 0-6-0 |
| ౭. | ఆభాస క్రైస్తవము | 1-8-0 |
| ౮. | జంబూ ద్వీపము | 0-6-0 |
| ౯. | ధృవనివాస ఖండనం | 3-8-0 |
| ౧౦ | భారతీయశకములు | 2-8-0 |
| ౧౧. | గుప్తరాజు లెవరు ? | 1-8-0 |
| ౧౨. | అగ్నివంశపురాజులు (నియోగ బ్రాహ్మణప్రభువులు) | 2-0-0 |
| ౧౩. | అశోకుని కాలము (నాటి యౌవనరాజులు) | 2-8-0 |
| | | 27-0-0 |

### అచ్చులోనున్నవి.

౧. ఆర్యావర్త ప్రాచీనత
౨. ఆర్యుల ప్రపంచ వ్యాప్తి [౨ సంపుటములు]
3 ఆర్యుల మతము
౪. ఆర్యుల సర్వతోముఖ విజ్ఞానము
౫. అద్వైతబోధిని
౬. నిర్విచార జీవనము
౭. మానవ సృష్టివిజ్ఞానము (తెలుగు)
౮. కలియుగ రాజవంశములు

వలయువారు దిగువ చిరునామాకు వెంటనే వ్రాయుడు :—

విజయవాడ,
15-12-1950.

కోట వెంకటాచలంగారు,
గాంధినగరం, విజయవాడ - 2

ఓమ్

# కలియుగ రాజ వంశములు

మగధసామ్రాజ్యమున రాజ్యము చేసిన రాజవంశముల చరిత్ర భారత యుద్ధానంతరమునుండి అనగా కలి పూర్వము 36 నుండి (క్రీ॥ పూ॥ 3138) పురాణములిట్లు వర్ణించియున్నవి. భారతయుద్ధకాలమును, కలిశక ప్రారంభమును లోగడ గ్రంధమున స్థిరపరచియుంటిమి. భారతయుద్ధమునకు పిమ్మట పరిపాలించిన వంశములు; వాని కాలములు

కలి పూర్వం 36 సం॥ (క్రీ॥ పూ॥ 3138 సం॥) నుండి
కలి పూర్వ 970 సం॥ (క్రీ॥ పూ॥ 2132 సం॥) వరకు

బార్హద్రథ వంశము :

(1) శ్లో॥ "ద్వావింశతి నృపాహ్యేతే భవితారో బృహద్రథాః ।
పూర్ణం వర్ష సహస్రం వై తేషాంరాజ్యం భవిష్యతి॥"
(వాయు; మత్స్యపురాణములు)

తా॥ బృహద్రథునివంశము వారలు 22 మంది రాజులు వేయి సం॥రములు రాజ్యము చేయుదురు. అని పురాణమందున్నది. విడిగా ప్రత్యేక రాజుల కాలములను కలుపగా వచ్చిన మొత్తం 1006.

(2) ప్రద్యోతవంశము 5 గురు – 138 సం॥

(కలిశకం 970 – 1108 ; క్రీ॥ పూ॥ 2132-1994)

"పంచప్రద్యోతనాఇమే,"
"అష్టత్రింశోత్తర శతం భోక్ష్యన్తి పృథివీం నృపాః". (విష్ణు. 12 – 2.)

తా॥ ఈ అయిదుగు ప్రద్యోతులు 138 సం॥లు రాజ్యముచేయుదురు

(3) శిశునాగవంశం – 10 మంది రాజులు – 362 సం॥

(కలిశకం 1108 – 1468 ; క్రీ॥ పూ॥ 1994 – 1634)

"ఇత్యేతేభవితారో వై శైశునాగా నృపాదశ ।
శతానిత్రీణి వర్షాణి ద్విషష్ట్యభ్యధికానితు॥"
(వాయు, 99 అధ్యా, 321 శ్లో॥)

తా॥ శిశునాగులు 10 మంది 362 సం॥రములు పాలింతురు.

ఇందులో లెఖ్ఖకు రెండు తక్కువ వచ్చినందున 360 సంవత్సరము లయినది.

(4) నందవంశము – 9 రాజులు నూరు సంవత్సరములు

(కలిశకం 1468 – 1568 ; క్రీ॥ పూ॥ 1634 – 1534)

"మహాపద్మః తత్పుత్రాశ్చ ।
ఏకం వర్ష శతం అవనిపతయో భవిష్యంతి॥"

తా॥ మహాపద్మనంద ఆతని కుమాళ్లు వక వంద సం॥రములు రాజలుగా నుందురు.

(5) మౌర్యవంశం 12 మంది రాజులు 316 సం॥రములు

(కలిశకం 1568 – 1884 ; క్రీ॥ పూ॥ 1534 - 1218)

"ద్వాదశైతే మౌర్యాః చంద్రగుప్తాదయో మహీం ॥
శతాని త్రీణి భోక్ష్యన్తి దశాషట్చసమాః కలౌ॥"
(కలియుగరాజ వృత్తాంత 3 భాగ. 2 వ అధ్యాయం.)

డాక్టరు యం. కృష్ణమాచార్యుల His. of Classical Literature. మరియు నడింపల్లి జగన్నాథరావుగారి "మహాభారత యుద్ధకాలము" చూడుడు.

తా॥ చంద్రగుప్తాదులైన యీ పండ్రెండుగురు మౌర్యరాజులు 316 సం॥రములు రాజ్యము చేయుదురు.

శ్లో॥ "ఇత్యేతే దశద్వావేచ భోక్ష్యన్తి వసుంధరాం ॥
శతాని త్రీణి వర్షాణి తేభ్యః శుంగాన్ గమిష్యతి।"

తా॥ డాక్టరు యం. కృష్ణమాచార్యులు గారివద్దయుండిన మత్స్య పురాణ వ్రాతప్రతినుండి వారు వ్రాసిన ప్రకారం – "ఈ పండ్రెండుగురు మౌర్యరాజులు మూడువందల సంవత్సరములు యేలిన పిమ్మట వారినుండి శుంగరాజులకు బోగలదు."

(6) శుంగవంశం 10 మంది రాజులు 300 సంవత్సరములు

(కలిశకం 1884-2184; క్రీ॥ పూర్వం 1218-918)

"దశైతే శుంగరాజానో భోక్ష్యన్తీమాం వసుంధరాం।
శతం పూర్ణం శతేద్వేచ తేభ్యః కణ్వాన్ గమిష్యతి"

తా॥ ఈ పదిమంది శుంగరాజులు 300 సం॥రములు యేలినపిమ్మట కణ్వరాజులకుబోవును.

(7) కాణ్వవంశం 4 రాజులు 85 సం॥రములు

(కలిశకం 2184-2269; క్రీ॥ పూర్వం 918-833)

"చత్వారస్తే భూపాలాః కణ్వగోత్ర సముద్భవాః।
ధర్మేణ భోక్ష్యంతి మహీంపంచాశీతిస్తువత్సరాన్॥"

తా॥ ఈ నలుగురు కాణ్వగోత్రీకులు 85 సం॥ ధర్మయుక్తముగా రాజ్యము చేయుదురు.

(8) ఆంధ్రశాతవాహనరాజులు 32 గురు రాజులు 506 సం॥రములు

(కలిశకం 2269-2775; క్రీ॥ పూర్వం 833-327)

"ఏతే ద్వాత్రింశాంధ్రాస్తు భోక్ష్యంతి వసుధామిమాం।
శతానిపంచపూర్ణాని తేషాం రాజ్యం భవిష్యతి॥"

తా॥ ఈ 32 గురు ఆంధ్రరాజులు 500 సంవత్సరములు రాజ్యము చేయగలరు. ప్రతిరాజుయొక్క రాజ్యకాలము కలుపుకొనిన 506 సం॥లు వచ్చుచున్నది.

(కలియుగరాజ వృత్తాంతం: శ్రీ కోట వెంకటాచలంగారి "కలిశక విజ్ఞానము ద్వితీయ, తృతీయభాగములు చూడుడు.)

(9) గుప్తరాజులు 8 గురు 245 సంవత్సరములు

(కలిశకం 2775-3020; క్రీ॥ పూర్వం 327-82)

"భోక్ష్యన్తి ద్వేశతేపంచచత్వారింశచ్చవైసమాః।
మాగధానాం మహారాజ్యం ఛిన్నం భిన్నంచసర్వశః।
స్థాపయిత్వామహాగుప్త వంశ్యా రాజ్యస్యతి సంస్థితాః॥"

తా॥ (5 + 7 = 12 శాఖలుగా చీలిపోయిన ఆంధ్రుల) మగధ సామ్రాజ్యము ఛిన్నాభిన్నమై మహాగుప్త రాజులను పొందును. వారు **245** సం॥రములు రాజ్యము చేయుదురు.

| వంశం పేరు | రాజుల సంఖ్య | పరిపాలించిన సం॥ భారతయుద్ధము నకు పిమ్మట | కలిశక సంవత్సరములు |
|---|---|---|---|
| 1. బార్హద్రథవంశం | 22 | 1006 | కలిపూ॥ 36 – కలి 970 |
| 2. ప్రద్యోతవంశం | 5 | 138 | కలి 970 – ,, 1108 |
| 3. శిశునాగవంశం | 10 | 360 | ,, 1108 – ,, 1468 |
| 4. నందవంశం (తండ్రి; కుమారులు 8 గురు) | 9 | 100 | ,, 1468 – ,, 1568 |
| 5. మౌర్యవంశం | 12 | 316 | ,, 1568 – ,, 1884 |
| 6. శుంగవంశం | 10 | 300 | ,, 1884 – ,, 2184 |
| 7. కాణ్వవంశం | 4 | 85 | ,, 2184 – ,, 2269 |
| 8. ఆంధ్రవంశం | 32 | 506 | ,, 2269 – ,, 2775 |
| 9. మహాగుప్తవంశం | 8 | 245 | ,, 2775 – ,, 3020 |
| | 105 | 3056 క॥ పూ॥ 36 కలి 3020 వఱకు | |

ఆంధ్రరాజుల మహా సామ్రాజ్యము ఛిన్నాభిన్నమై విభాజ్యమైన పిమ్మట మహాగుప్తరాజులలో మొదటిరాజు చంద్రగుప్తుడు మగధను విడిచి పాటలీపుత్రమున పట్టాభిషిక్తుడై చక్రవర్తి కాలేక అల్పరాజ్యాధిపతి మాత్రముగా నుండెను. ఇతని కుమారుడు సముద్రగుప్తుడు దిగ్విజయమునుచేసి అయోధ్యయందు చక్రవర్తి కాగలిగినాడు. కాని ఆయన జీవితకాలములోనె తిరిగి సామ్రాజ్యము విడి సామంతరాజులు స్వతంత్రులైరి. పిమ్మట రెండవ చంద్రగుప్తుడు, కుమారగుప్తుడు, స్కందగుప్తుడు మొదలుగాగల వారలు నామమాత్రము చక్రవర్తులుగా నుండిరి. వారి రాజ్యపరిపాలన కాలమంతయు శక, హూణాదులతో పోరాడుటతో సరిపోయినది. తుదకు కలి 3020 సంవత్సరములో గుప్త రాజ్యమే అంతరించినది. ఇట్లుండగా అవంతి రాష్ట్రమునకు ముఖ్య

పట్టణమగు ఉజ్జయిని యందుండి రాజ్యముచేయుచు గుప్తరాజులకు శత్రువుగానుండిన శకరాజును కలి 3020 సం॥రమున "విక్రమార్కుడు" అనెడి అగ్నివంశపు రాజు యోడించి శకులను దేశమునుండి వెడలనడిచి ఉజ్జయినీయందు కలి 3020 సం॥రములో పట్టాభిషిక్తుడయ్యెను. అందు వలన కలి 3020 లగాయతు అగ్నివంశములు నాలుగింటిలో యొకటగు "ప్రమర" వంశమునకు చెందిన ఉజ్జయినీ యందధికారమును వహించిన "శకహంత" యగు విక్రమార్కుని నుండి పిమ్మట కాలమును గుర్తించు దము. విక్రమార్కుని కాలమును గురించి భవిష్య మహాపురాణం. 3-1-7-14 ల॥ 16 శ్లో॥ లలో యిట్లు చెప్పబడినది.

(ఈ విషయము లోగడ పుటలలో యిచ్చియున్నదైనను సందర్భానుసారముగా యిచ్చుటగూడ నిచ్చుచుంటిమి.)

శ్లో॥ "పూర్ణేత్రింశచ్ఛతే వర్షే కలౌ ప్రాప్తే భయంకరే ॥ (3-1-7-14)
శకనాంచవినాశార్థ మార్యధర్మ వివృద్ధయే ।
జాతః శివాజ్ఞయా సోఽపి కైలాసాద్గుహ్యకాలయాత్ ॥ (15)

విక్రమాదిత్యనామానం పితాకృత్వాముమోదహ
సబాలోపి మహాప్రాజ్ఞః పితృమాతృప్రియంకరః ॥ (16)

తా॥ కలిలో మూడువేల సంవత్సరములు నిండిన పిమ్మట (క్రీ॥ పూ 101 సం॥) శకులను నాశనముచేసి ఆర్యధర్మమును వృద్ధిపొందించుటకు శివుని ఆజ్ఞవలన గుహ్యకాలయమునుండి యొక పురుషుడు [illegible] గంధర్వసేన మహారాజునకు కుమారుడుగ [illegible] ఆ పిల్లవానికి "విక్రమాదిత్య" యను నామమునుంచి తండ్రి సంతోషించెను. ఆతడు మహాప్రాజ్ఞుడును పితృమాతృప్రియంకరుడనైయుండెను.

"విక్రమాదిత్య"యను తండ్రివలన జననకాలమున పెట్టబడిన పేరే గాని ఆతని కలి బిరుదు కాదు. ఈ విక్రమార్కుడు కలి 3020 (క్రీ॥ పూ॥ 82) సంవత్సరమున ఉజ్జయినీలో రాజయ్యెను. గనుక ఆతనినుండి పిమ్మట రాజుల కాలమును గుర్తించుదము.

(10) ప్రమరవంశం.

కలిశకం 3020—4295 క్రీ॥ పూ॥ 82 - క్రీ॥ శ॥ 1193

కలి 3020 లగాయతు యీ వంశములో విక్రమార్క మహారాజు లగాయతు రాజ్యముచేసిన రాజులు 24 గురు 1275 సంవత్సరములు.

(11) మహమ్మదీయులు, మహారాష్ట్రులు, బ్రిటిష్ మొదలగు వారలు 753 సంవత్సరములు.

కలిశకం 4295-5048- క్రీ॥ శ॥ 1194-1947

1947 సం॥ ఆగష్టు 15 తేదీ, కలిశకం 5048 సం॥

శాలివాహనశకం 1869 సం॥

సర్వజిత్ నామ సం॥ అధికశ్రావణ బ॥ 30 శుక్రవారం. —భారత దేశ స్వాతంత్ర్యావతరణము.

కలి ప్రవేశకాలమునుండి "కలిశకము" ప్రారంభింపబడి లెక్క పెట్టబడుచు నేటివఱకు ప్రతి సంవత్సరమున పంచాంగములలో నెన్గొక సం॥రమును తెలుపుకొనుచు లెక్క చూపుచుండుటను మనము చూచుచుంటిమి. కలిశకము ప్రారంభించి యిప్పటికి 5050 సం॥రములైనది. క్రీస్తుశకం ప్రకారం క్రీస్తుకు పూర్వం 3102 సం॥రమునుండి ప్రారంభించి నేటివరకు వరుసను లెక్కింపబడుచున్నది.

| | |
|---|---|
| క్రీస్తుకు పూర్వం జరిగిన సంవత్సరములు | 3101 |
| దరిమిలా క్రీ॥ శకముకట్టేసల జరిగిన సంవత్సరములు | 1949 |
| మెరశి— | 5050 సం॥ర |

ములు జరిగినవి. కలి ప్రవేశకాలము క్రీ॥ పూ॥ 3102 సం॥ ది 20 ఫిబ్రవరి రాత్రి 2-27-30 సమయమునకు అయియున్నది. కనుక ఈ కాలములో సప్తర్షి చలనమును రాజవంశావళికాలములో కలిపి పురాణములలో చెప్పబడినట్టి కాలమును గుర్తించుచున్నాము

# కలియుగ రాజవంశావళి కాలము:

## సప్తర్షి మండల చలనమును ననుసరించి.

### సప్తర్షి చలనము

భారతయుద్ధమైన సంవత్సరమునకే "పరీక్షిత్తు" జననము. యుధిష్ఠిరశక ప్రారంభము. ఆ కాలమున "సప్తర్షిమండలం" "మఖా" నక్షత్రమందుండియున్నది. ఒక్కొక్క నక్షత్రములో సప్తర్షి మండలం నూరు సంవత్సరముల కాలము గడుపుచు నక్షత్ర చక్రమునంతను 2700 సం॥రములలో చుట్టుచుండునని పురాణము చెప్పుచున్నది అది భారత యుద్ధకాలము లేక పరీక్షిత్తు జనన కాలమున లేక యుధిష్ఠిరశక ప్రారంభ కాలమున "మఖ" యందుండి యున్నట్లుగ చెప్పుచున్నది.

శ్లో॥ "సప్తర్షయో మఘాయుక్తాః కాలే పారీక్షితే శతం
ఆంధ్రాంశే సచతుర్వింశే భవిష్యంతి మతేమమ॥"
(వాయు. 99 అధ్యా 423 శ్లోకం)

తా॥ పరీక్షితుని కాలమున "సప్తర్షులు" మఖానక్షత్రమందు శతసంవత్సరములుండిరి. ఆంధ్రరాజ వంశమువచ్చు నాటికి వారు యిరువదినాలుగవ శతమునకు రాగలరు. అని పురాణము చెప్పుచున్నది.

కలిలో ౭౫ సం॥రములు జరిగిన పిదప సప్తర్షి మండలం "మఖా నక్షత్రమును దాటి తరువాతగల నక్షత్రములోనికి పోయియున్నది. అనగా మఖ నుండి పూర్వఫల్గుణినక్షత్రము (పుబ్బ) నకు బోవును. (సప్తర్షి మండలం వెనుకకు నడచునని (Retrograde motion) కలియుగ రాజవృత్తాంతము చెప్పుచున్నది. అట్లు వెనుకకునడచిన "మఖ" నుండి "ఆశ్లేష" కు జనును. ఏమైననుగాని ఏదియొ వాదమునుగాని తప్పుదెచ్చుట నున్నదను విషయము గాని యీ సందర్భమునకు పరిష్కరించ నవలంబింపక యే గ్రంథ మీ విధమున జెప్పినదో ఆ దేశ ప్రకారము మనము లెక్కవేసి కాలగణనము చేసికొనుట సమంజసము. ప్రతినక్షత్రమునను సప్తర్షులు శతసంవత్సరములుండు రనెడి వాదముభయవాదు లంగీకరించినదై యున్నది. పరీ

క్షిత్తు కాలమున "మఖ" యందుండినటుల ఉభయవాదులు అంగీకరించుచున్నారు. మన మెవరివాదము ప్రకారము లెఖ్ఖ వేసినను కాలగణనములో తేడా రాజాలదు. ఇందు మనకు కాలము ముఖ్యముగాని సప్తర్షుల గమనరీతి కాదు. దానికి ప్రత్యేక విచారణ అవసరము. (ఆ విచారణ యీ గ్రంథకర్తగారిచే వ్రాయబడిన "కలిశక విజ్ఞానము ప్రథమభాగం" 45-47 పుటలలో పర్యవసానము తేల్చబడి యున్నది. దాని నచ్చట చూచుకొనునది॥).

సప్తర్షి మండలం కలిపూర్వం 75 సంవత్సరమున 'మఖ" లో ప్రవేశించినది. కలి పూర్వం 36 సం॥ రమున భారతయుద్ధము, యుధిష్ఠిర శకప్రారంభము, పరీక్షిన్మహారాజు జననము జరిగియున్నవి. కలిప్రవేశ మునకు సప్తర్షి మండలం "మఖాశతము" లో 75 సం॥ గడపియున్నది. శేషం 25 సం॥రములు కలి 25 సం॥రముకు పూర్తిచేసి కలి 26 సం॥ ప్రారంభమున మఖా నక్షత్రమును విడిచి తరువాత గల నక్షత్రములో ప్రవేశించినది. కలి 26 సం॥ర ప్రారంభమున సప్తర్షి శకము లేక లోక కాలము లేక లౌకికాబ్దము లేక యుధిష్ఠిర కాలమనెడి పేరుతో యొక శకము స్థాపింపబడినది. ఈ శకమును గురించి యీ గ్రంథం లోగడపుట లలో వివరింపబడినది.

పురాణములన్నియును, బృహత్సంహితయనెడి జ్యోతిషగ్రంథ మున్నూ, కలియుగరాజ వృత్తాంతమనెడి గ్రంథమున్నూ యుధిష్ఠిర రాజ్యకాలమున లేక పరీక్షిత్తు కాలమున సప్తర్షిమండలం "మఖ"లో నున్నటుల చెప్పుచున్నవి.

1. మఖాశతములో పరీక్షిన్మహారాజు జననము.

2. మఖనుండి సప్తమైన నడకలో సప్తర్షి మండలం 24 వ నక్షత్ర మైన ఆరుద్రశతముకు వచ్చినపుడు మగధయందు "ఆంధ్ర సామ్రాజ్యస్థాప నము. "రాజు శ్రీముఖుడు. యు. శ. 2305 సం॥" (క్రీ॥ పూ॥ 833 సం॥)

3. ఇరువది నాలుగవ ఆంధ్రరాజు "శివశాతకర్ణి" కాలము యు. శ. 2677-2705. సప్తర్షులు యుధిష్ఠిరశక ప్రారంభములో (ఇదే

పరీక్షితుని జననకాలము) మఖయందుండి 2700 సం॥రములలో 27 నక్షత్రములుగల నక్షత్రమండలమును చుట్టి తిరిగిమఖలోనికి వచ్చియుండిరి. (కలిశక విజ్ఞానం "కలిరాజ వంశావళి" అను గ్రంధమును చూడుడు) ఆంధ్రవంశపు రాజులు 32 మంది యు. శ. 2811 క్రీ॥ పూ॥ 327 సం॥ వఱకు పరిపాలించియుండిరి. పిమ్మట మహాగుప్తవంశపు రాజులు రాజ్యమునకు వచ్చిరి.

ఈ విషయమునే "కలియుగరాజ వృత్తాంతము" యిట్లు వివరించుచున్నది. సప్తర్షి మండలం అపసవ్యముగా తిరుగుచుండునని "కలియుగరాజ వృత్తాంత" గ్రంధకారునిమతము. దానిననుసరించి లెఖ్ఖ చూచునప్పుడు ఆ గ్రంధకారుని మతము ననుసరించి మనము కాలమును లెక్కించుట సమంజసము. అపసవ్యనడక ప్రకారము సప్తర్షి మండలం "మఖానక్షత్రము" నుండి "ఆశ్లేషానక్షత్రము"నకు వచ్చును. ఆ విషయము కలియుగరాజ వృత్తాంతమున యిట్లు చెప్పబడినది.

శ్లో॥ "యదాయుధిష్ఠిరోరాజా శక్రప్రస్థేప్రతిష్ఠితః
తదాసప్తర్షయః ప్రాపుర్మఘాః పితృహితేరతాః॥

శ్లో॥ "పంచసప్తతివర్షాణి ప్రాక్ కలేః సప్తతేద్విజాః
మఘాస్వాసన్ మహారాజే శాసత్యుర్వీం యుధిష్ఠిరే॥

శ్లో॥ "పంచవింశతివర్షేషుగతే ష్వథ కలౌ యుగే
సమాశ్రయన్త్యాశ్లేషాం మునయస్తే శతం సమాః॥

తా॥ శక్రప్రస్థమున యుధిష్ఠిరుడు పట్టాభిషిక్తుడైనపుడు సప్తర్షులు పితృహితమగు మఘానక్షత్రమును ప్రాపుచేసుకొని సంచరించుచుండిరి. కలి పూర్వము 75 సంవత్సరములక్రితము సప్తర్షులు "మఖానక్షత్రము" న ప్రవేశించిరి. సప్తర్షులు మఖానక్షత్రమందుండిన కాలమున యుధిష్ఠిరుడు రాజ్యమును పాలించెను

కలియుగములో 25 సం॥రములు గడచిన పిదప (26 సం॥రమున) సప్తర్షులు "ఆశ్లేషానక్షత్రము"ను చేరి నూరు సం॥రములుందురు అని చెప్పబడినది.

కలిప్రవేశము క్రీ॥ పూ॥ 3102 సం॥ ఫిబ్రవరి 20 వ తేదీనై యున్నది కలిపూర్వం 75 అనగా క్రీ॥ పూ॥ 3177 సం॥రములో సప్తర్షి మండలం మఖానక్షత్రములో ప్రవేశించియున్నది కలిపూర్వం 36 సం॥ రము అనగా క్రీ॥ పూ॥ 3138 సం॥రములో భారతయుద్ధము జరిగినది. (అనగా 3177 - 3138 = 39) సప్తర్షి మండలం మఖయందు ప్రవేశించిన 39 సం॥రములకు భారతయుద్ధము జరిగియున్నది. యుద్ధములో జయించి యుధిష్ఠిరుడు పట్టాభిషిక్తుడైనాడు. యుద్ధమునకు పూర్వము గర్భవతిగా నుండిన (అర్జునుని కుమారుడు అభిమన్యుని భార్యా) ఉత్తరాదేవికి "పరీక్షిత్తు" ఆ సం॥రముననే అనగా క్రీ॥ పూ॥ 3138 సం॥రమున జన్మిం చెను. క్రీ॥ పూ॥ 3177 సం॥రమున మఖానక్షత్రమందు ప్రవేశించిన సప్తర్షిమండలం మఖానక్షత్రమందు నూరు సంవత్సరములుండి అపసవ్య నడకను "ఆశ్లేషానక్షత్రము"న కలి 25 సం॥రము అనంతరము 26 సం॥ర మున అనగా (3101 - 25 = ) క్రీ॥ పూ॥ 3076 సం॥రమున ప్రవేశించి నట్లు పురాణము చెప్పుచున్నది. కనుక సప్తర్షిమండలం అపసవ్య నడ కను వెనుకకు తిరుగుచున్నటులనే యెంచి యీకలియుగరాజ వృత్తాంత కారుని మతప్రకారమే మనము సప్తర్షులగమనమును లెక్కించి రాజ వంశావళి కాలమును సరిచూచుకొందము.

శ్లో॥ "సప్తర్షయోమఘాయుక్తాః కాలే యాధిష్ఠిరేశతం ।
శ్రవణేతే భవిష్యన్తి కాలే నందస్యభూపతేః॥

శ్లో॥ "చతుర్వింశేధనక్షత్రే భవిష్యంతి శతం సమాః ।
ఆంధ్రరాజ్యారంభ కాలాదారభ్యైతే సురర్షయః॥

శ్లో॥ "మహాపద్మాభిషేకాత్తు యావజ్జన్మ పరీక్షితః ।
ఏకమేవ సహస్రంతుజ్ఞేయం పంచశతోత్తరం॥

శ్లో॥ "ఆంధ్రరాజ్యోపక్రమాత్తు యావన్నందాభిషేచనం ।
అంతరం తచ్ఛతాన్యష్టౌ ప్రమాణజ్ఞైః సమాః స్మృతాః॥

శ్లో॥ "యదా పునర్వసుం యాస్యంత్యేతే సప్తర్షయః పునః ।
తదాశ్రీగుప్తవంశానాం రాష్ట్రం త్వస్యం గమిష్యతి ॥

శ్లో॥ "పూర్వాభాద్రాం యదా తేతు ప్రవేక్ష్యంతి పునర్ద్విజాః ॥
గుప్తే భ్యో మాగధం రాజ్యం తదాపాలాన్ గమిష్యతి ॥"
(కలియుగరాజ వృత్తాంతం. ౨ భా. ౪ అధ్యా.)

తా॥ యుధిష్ఠిరుని కాలములో సప్తర్షులు మఖయందు నూరు సంవత్సరములుండిరి. మహాపద్మనందుని కాలమున అది శ్రవణ నక్షత్ర శతమునందుండినది. ఆంధ్రుల పరిపాలన (మగధయందు) సాగించు నాటికి సప్తర్షి మండలం మఖనుండి యిరువదినాలుగవ నక్షత్రమందుండ గలదు. పరీక్షితుని జననము లగాయతు మహాపద్మనందుని పట్టాభిషేకము వఱకు 1500 సం॥రములు. నందాభిషేకము నుండి ఆంధ్రరాజ్య ప్రారంభమునకు 800 సం॥రములు సప్తర్షి మండలము (రెండవ ఆవర్తిలో) పునర్వసు నక్షత్రమును చేరునాటికి గుప్తరాజ్యము క్షీణదశకు గలదు. అది పూర్వాభాద్రానక్షత్రమును చేరునప్పటికి గుప్తులదైన మగధ రాజ్యము "పాలరాజుల" ను చేరును, అని చెప్పబడినది.
(కలియుగ రాజవృత్తాంతం ౨ భాగం ౪ అధ్యా)

ఈ పై వాక్యములు "సప్తర్షి మండలం వెనుకకు తిరుగునని సిద్ధాంతీకరించుకొని చెప్పబడినవి. మనకిప్పుడు కావలసినది సప్తర్షిమండల చలనము పైపుగా నుండునని కాదు. భారతయుద్ధమునకు పిమ్మట ఆంధ్రుల సామ్రాజ్యాంతమునకెంత కాలమగునది కొంచెము విచారించవలసి యున్నది. ఈ కాల నిర్ణయమును గురించి పురాణములు ప్రతిరాజును, అతడు పరిపాలించిన సంవత్సరములను చెప్పి, పిమ్మట ఆ వంశము మొత్తమెంత కాలము పరిపాలించినది వివరించి అంతటను త్రిస్కంధర కాలప్రమాణము ప్రవచనములలోను, వ్రాతప్రతి వ్రాయునప్పుడు విద్వాంసులు కాని వ్రాయసకాని లోపములచేతను, వ్రాత ప్రతులచొప్పించునప్పుడు దొర్లెడి దోషముల వలనను, గ్రంథమును సవరించి పరిష్కరించెడి పండితుల భావముల ననుసరించి సవరణలు జరుగుచుండుటవలనను గలిగెడి లోటు పాటును గుర్తించి రాజవంశావళి కాలములను సరిచేసుకొనుట కను కూలముగా నుండులాగున పెట్టెసితిగతులలోను పౌరబాటభిప్రాయముల కెడమీయనట్టియు, ప్రకృతి సిద్ధముగానుండునట్టియు నొకలెక్క

కూడను పురాణములలో నీయబడినది. దీనిని లోగడ చరిత్రకారులందరు యుపేక్షించి యుండిరి. అదియే సప్తర్షి మండలచలనము. దీర్ఘకాల లెఖ్ఖలను సరిచూచుకొనుటకీ సప్తర్షి మండల చలనమును రాజవంశావళీ కాలముతో వరుసను గుర్తించుచు పురాణము పై వాక్యములను చెప్పి యున్నది. గనుక దాని ననుసరించి మనము భారత యుద్ధకాలమునుండి వరుసను రాజువంశావళుల కాలమును గుర్తించుదము.

సప్తర్షి మండలం "మఖ" లో ప్రవేశం కలిపూర్వం 75 క్రీ॥పూ॥ 3177
భారతయుద్ధము జరిగినకాలము ,, 36 ,, 3138
(సప్తర్షులు మఖలో 39 సం॥ జరిగిన పిమ్మట భారతయుద్ధం పరీక్షిత్తు జననం.)

సప్తర్షి మండలం (అపసవ్య నడకతో ఆశ్లేషయందు ప్రవేశము) } కలిశం 26 ,, 3076

సప్తర్షి మండలం భారతయుద్ధమునకు పిమ్మట "మఖ"లో గడిపిన సం॥లు కలిపూ॥ 36 + కలిలో 25 = 61 సం॥ } కలిపూ॥ 36 లు ,, 3137 లు; కలిశకం 25 వ॥ 3075

భారతయుద్ధమునకు పిమ్మట – అపసవ్యనడకతో సప్తర్షి మండల చలనమును గుర్తింపు.

| వరుస సం. | నక్షత్రం పేరు | గడిపిన కాలం | కలిశక సం॥రములు లగాయతు, వరకు కలి పూర్వం | క్రీ॥శక సం॥ములు లగాయతు, వరకు క్రీ॥ పూర్వం |
|---|---|---|---|---|
| (1) | మఖలో | 61 | 26-కలి25 | 3137-3076 |
| (2) | ఆశ్లేష | 100 | 26- 126 | 3076-2976 |
| (3) | పుష్యమి | 100 | 126- 226 | 2976-2876 |
| (4) | పునర్వసు | 100 | 226- 326 | 2876-2776 |
| (5) | ఆరుద్ర | 100 | 326- 426 | 2776-2676 |
| (6) | మృగశీర్ష | 100 | 426- 526 | 2676-2576 |
| (7) | రోహిణి | 100 | 526- 626 | 2576-2476 |

బ్రాటోవరు

| | | | | |
|---|---|---|---|---|
| (8) | కృత్తిక | 100 | 626- 726 | 2476-2376 |
| (9) | భరణి | 100 | 726- 826 | 2376-2276 |
| (10) | అశ్విని | 100 | 826- 926 | 2276-2176 |
| (11) | రేవతి | 100 | 926-1026 | 2176-2076 |
| (12) | ఉత్తరాభాద్రా | 100 | 1026-1126 | 2076-1976 |
| (13) | పూర్వాభాద్రా | 100 | 1126-1226 | 1976-1876 |
| (14) | శతభిషం | 100 | 1226-1326 | 1876-1776 |
| (15) | ధనిష్ఠ | 100 | 1326-1426 | 1776-1676 |
| (16) | శ్రవణాలో ప్రవేశించిన 42సం॥ తరువాత మహాపద్మనంద | 42 | 1468-1568 (నందవంశ కాలం) | 1634-1534 (నందవంశ కాలం) |

కాలము 1503 భారతయుద్ధమునకు పిమ్మట 1503 సం॥ములు జరిగిన పిమ్మట 1504 సం॥రములో మహాపద్మనంద పట్టాభిషిక్తుడై నూరు సం॥ములు భారతయుద్ధముకు పిమ్మట 1504-1604 వరకు ఆగసివంశము " నందన శ " మను పేర రాజ్యము చేసియుండిరి. (కలిశక విజ్ఞానము ద్వితీయభాగము " కలిరాజ వంశావళి" చూడుడు )

పై కలియుగ రాజ వృత్తాంతములో చెప్పబడిన

" శ్రవణేతే భవిష్యంతి కాలే నందస్య భూపనేః "

" మహాపద్మనందుని కాలములో సప్తర్షి మండలం శ్రవణములో నుండును " అను వాక్యము ప్రకారం సరిపోవుచున్నది.

పరీక్షితుని జననము లగాయతు మహాపద్మనందుని పట్టాభిషేక కాలముకు 1500 సం॥రములని చెప్పబడినవాక్యమున్నూ సరిపోవుచున్నది.

భారతయుద్ధము లగాయతు 24 నక్షత్రశతములో ఆంధ్రరాజ్యారంభ కాలమని పై శ్లోకములలో చెప్పబడినది. దానిని సరిచూచుచుంటిమి.

భారతయుద్ధములగాయతు ధనిష్ఠ ఆఖరుకు 1461 సంవత్సరములు లెక్కకువచ్చియున్నది.

| వరుస సెం. | నక్షత్రం పేరు | గడిచిన కాలం | కలిశక సం॥రం లగాయతు వరకు | క్రీ॥శక సం॥ల లగాయతు వరకు. క్రీ॥ పూర్వం |
|---|---|---|---|---|
| | ధనిష్ఠ ఆఖరుకు | 1461 | 1426 వరకు | 1676 వరకు |
| (16) | శ్రవణం | 100 | 1426-1526 | 1676-1576 |
| (17) | ఉత్తరాషాఢ | 100 | 1526-1626 | 1576-1476 |
| (18) | పూర్వాషాఢ | 100 | 1626-1726 | 1476-1376 |
| (19) | మూల | 100 | 1726-1826 | 1376-1276 |
| (20) | జ్యేష్ఠ | 100 | 1826-1926 | 1276-1176 |
| (21) | అనూరాధ | 100 | 1926-2026 | 1176-1076 |
| (22) | విశాఖ | 100 | 2026-2126 | 1076- 976 |
| (23) | స్వాతి | 100 | 2126-2226 | 976- 876 |
| (24) | చిత్రలో | 44 | 2269 ఆంధ్ర | 833 ఆంధ్ర |
| | 44 సం॥లో ఆంధ్ర సామ్రాజ్యప్రారంభం | | సామ్రాజ్య స్థాపనము | సామ్రాజ్యస్థాపనము |

2305 భారతయుద్ధమునకు పిమ్మట 2305 వ, సం॥ ములలో సప్తర్షి మండలము మఖ నుండి బయలుదేరి 24 వ నక్షత్రమైన "చిత్రానక్షత్ర" శతమునకు వచ్చియుండగా ఆంధ్రసామ్రాజ్యము మగధయందు స్థాపింపబడినది.

(ఈ గ్రంథకర్తగారిచే రచింపబడిన "కలిశకవిజ్ఞానం. ద్వితీయ భాగము కలిరాజవంశావళి" గ్రంథమును చూడుడు.)

మహాభారతయుద్ధ సంవత్సరం లేక పరిక్షిజ్జనన సంవత్సరం నుండి మహాపద్మనందుని పట్టాభిషేకము వరకు 1504 సంవత్సరములు. అంతటి నుండి ఆంధ్రరాజ్యస్థాపనవరకు 800 సంవత్సరములు. వెరశి 2305 సం॥రములు జరిగినవి. సప్తర్షి చలనము ననుసరించిన యీ లెక్క సరిగా సరిపోవుచున్నది.

సప్తర్షులు పునర్వసు నక్షత్రమునకు వచ్చునప్పటికి మహాగుప్తుల రాజ్యము క్షీణించిపోవును. అని చెప్పబడిన వాక్యమును సరిచూచుదము. మఖనుండి 9 వ నక్షత్రం స్వాతి ఆఖరుకు మొత్తం సం॥ ములు 2 61.

| | | | |
|---|---|---|---|
| ప్రారంభంనుండి | 2261 | | |
| (24) చిత్ర | 100 | 2226-2326 | 876-776 |
| (25) హస్త | 100 | 2326-2426 | 776-676 |
| (26) ఉత్తర | 100 | 2426-2526 | 676-576 |
| (27) పూర్వఫల్గుణి | 100 | 2526-2626 | 576-476 |
| (28) మఖలో | 39 | 2626 + 39 | 476- 39 |
| (రెండవచుట్టులో | | =2665 | =437 |

ప్రారంభం) 2700 సప్తర్షి మండలం భారతయుద్ధము లగాయతు అనగా మఘాశతములో 40 సంవత్సరము లగాయతు ఒకచుట్టు పూర్తి చేసుకొని తిరిగి మఖలోనికి వచ్చి 39 సంవత్సరములు తిరిగిన 2700 సం॥రములు పట్టును. ఆప్రకారము కలి 2665 సం॥రమునాటికి కలిపూర్వము అనగా భారతయుద్ధము కలి ప్రారంభంవరకు మఖలో గడిపిన 36 సం॥రములు కలుపగా 2700 సం॥రములుగల యొకచుట్టు పూర్తిచేసికొని తిరిగి మఘాశతము 40 సం॥రమున రెండవచుట్టు తిరుగ ప్రారంభించును. కలిశకం 2665 సం॥రమునకు యొకచుట్టు పూర్తియగునాటికి యిరువది నాలుగవ ఆంధ్రరాజు "శివశాతకర్ణి" కలి 2641 లగాయతు 2669 వరకు రాజ్యము చేయుచుండినందున ఆతని కాలములో రెండవచుట్టు మఖలో ప్రారంభమగునని చెప్పబడిన పురాణవాక్యము అక్షరాల సరిపోవుచున్నది.

"సప్తర్షయో మఘాయుక్తాః కాలే పారిక్షితే శతం ।
ఆంధ్రాంశే స చతుర్వింశే భవిష్యంతి మతేమమ ॥"

అని చెప్పబడిన వాయు పురాణము. 99 అధ్యా 423 శ్లోక వాక్యమునకున్నూ అక్షరాల సరిపోవుచున్నది. అటు పిమ్మట 25 లగాయతు 32 వఱకుగల ఆంధ్రరాజులు 110 సం॥రములు రాజ్యముచేసి యుండిరి. కలి. 2665 + 110 = కలి. 2775 (క్రీ॥ పూ 327) వఱకు ఆంధ్రరాజ్య ముండియున్నది. కలి 2775 (క్రీ॥ పూ॥327 సం॥)లో మహా గుప్తులు రాజులైరి. ఆంధ్రరాజులు విక్రమత్వమును గోల్పోయి సామ్రా

జ్యమును ముక్కలు ముక్కలుగా చేసి విభాగించుకొని యెవకివారు స్వతంత్రులైరి. మహాగుప్తరాజులు మగధను విడిచి పాటలీపుత్రమున గుప్త చంద్రగుప్తుని పిమ్మట ఆతని కుమారుడు సముద్రగుప్తుడు అయోధ్యయందును పట్టాభిషిక్తులై అచ్చటనుండి రాజ్యమును పరిపాలించి యుండిరి. ఇకను మనము సప్తర్షిమండల గమనము ననుసరించుదము.

| బ్రాటోవరు | 2665 | కలి సం॥ | క్రీ॥ పూ॥ సం॥రలు |
|---|---|---|---|
| (28) రెండవ చుట్టు మఖలో 40 సం॥ లగా॥ ఆఖరుకు | 61 | 2665-2726 | 437-376 |
| (29) ఆశ్లేష | 100 | 2726-2826 | 376-276 |
| (30) పుష్యమి | 100 | 2826-2926 | 276-176 |
| (31) పునర్వసు | 100 | 2926-3026 | 176- 76 |

(క్రీస్తుపూర్వం 82 లో గుప్తరాజ్య మంతరించినది.)

సప్తర్షిమండలం తిరిగి (రెండవచుట్టులో) "పునర్వసు" నక్షత్రము నకు వచ్చినపుడు మహాగుప్తరాజ్యము అన్యాక్రాంతమగునని చెప్పబడిన

"యదా పునర్వసుం యాస్యంత్యేతే సప్తర్షయః పునః ।
తదా శ్రీ గుప్తవంశానాం రాష్ట్రం త్వన్యం గమిష్యతి॥"

అనెడి పురాణవాక్యము సరిగా సరిపోవుచున్నది.

మహాగుప్తరాజ్యము కలి 3020 సం॥రము క్రీ॥ పూ॥ 82 సం॥ర ములో అంతరించినది. ఆ కాలమున సప్తర్షులు పునర్వసు నక్షత్రమం దుండి . (ఈ గ్రంథకర్తగారి కలిశక విజ్ఞానం ద్వితీయ తృతీయ భాగము లలో ఆంధ్ర, గుప్తవంశముల చరిత్రలు చూడుడు)

సప్తర్షిమండలం భారతయుద్ధము లగాయతు తిరిగిన రెండవ చుట్టులో పూర్వాభాద్రా నక్షత్రమునకు వచ్చునపుడు పిమ్మట రాబడిన గుప్తులయొక్క మగధరాజ్యము పాలరాజులను పొందును అని చెప్ప బడిన వాక్యమును సరిచూచుకొందము.

| | | | క్రీ॥పూ॥ క్రీ॥శ॥ |
|---|---|---|---|
| (32) ఆరుద్ర | 100 | 3026-3126 | 76- 24 |
| (33) మృగశీర్ష | 100 | 3126-3226 | క్రీ. శ. 24-124 |
| (34) రోహిణి | 100 | 3226-3326 | ,, 124-224 |
| (35) కృత్తిక | 100 | 3326-3426 | ,, 224-324 |
| (36) భరణి | 100 | 3426-3526 | ,, 324-424 |
| (37) అశ్వని | 100 | 3526-3626 | ,, 424-524 |
| (38) రేవతి | 100 | 3626-3726 | ,, 524-624 |
| (39) ఉత్తరాభాద్ర | 100 | 3726-3826 | ,, 624-724 |
| (40) పూర్వాభాద్ర | 100 | 3826-3926 | ,, 724-824 |

భుక్తి 39 సం॥ 3826 + 39 + కలి పూర్వం 36 = 3901 సం॥ ;
క్రీ. శ. 724 + 39 + 36 = 799 + 3102 = 3901 సం॥రములు.

సప్తర్షుల రెండవచుట్టులో 28 నక్షత్రం మఖలో శేషం 61 సం॥రములు. ఆశ్లేష ప్రారంభించి ఉత్తరాభాద్ర ఆఖరువరకు 11 నక్షత్రములకు 1100 సం॥రములు. పూర్వాభాద్రలో 39 సంవత్సరములు. (61 + 1100 + 39 = ) వెరశి 1200 సం॥రములు. మొదటిచుట్టు కలి 2665 లో పూర్తిచేసి రెండవచుట్టులో పూర్వాభాద్ర 39 సం॥రముకు 1200 సం॥రములు జరిగినది. (కలి 2665 + 1200) = కలి 3865 కు కలి పూర్వం భారతయుద్ధకాలముకు గల కాలము 36 సం॥రములు కలుపగా (3865 + 36 = ) కలి 3901 సం॥రములు వచ్చును. భారతయుద్ధము నుండి 3901 సంవత్సరముల రాజవంశావళి మనకు సిద్ధమగుటయేగాక రాజవంశావళులకాలము వరుస క్రమముగా సిద్ధమగుచున్నది. భారత యుద్ధమునుండి క్రీస్తుశక ప్రారంభముకు 3138 సం॥రములు మినహాయించగా క్రీ॥ శ॥ 763 సం॥రము వచ్చును. అప్పటికి గుప్తరాజుల మగధ రాజ్యము వంగదేశ "పాలరాజు"లకు చేరునని పురాణము వివరించుచున్నది. వంగదేశమున "మొదటి గోపాల" అను పాలరాజు కలి 3864 - 3909 సం॥రములలో (క్రీ॥ శ॥ 763 - 807) బంగాళాదేశమును పాలించుచున్నట్లు చరిత్రకారులు వ్రాసినదానికిది సరిగా సరిపోవుచున్నది.

( )

క్రీ॥ శ॥ 762 లగాయతు 807 సం॥రములలో ఉజ్జయినీయందు భోజరాజుకు పిమ్మట వచ్చిన ఏడుగురిలో రెండవరాజు చివరకాలము క్రీ॥శ॥ 733 లగాయతు 763 వరకుగల కాలమున క్రీ॥శ॥ 762 సం॥రముననె మగధరాజ్యమును పాలరాజులు జయించిరి. భోజరాజుకు పిమ్మట రాబడిన ఏడుగురు రాజులలో ఆఖరురాజు "వీరసింహుడు" క్రీ॥ శ॥ 933–'93 వఱకున్నూ, పదవరాజు "గంగసింహుడు" క్రీ॥ శ॥ 1113–1193 వఱకును రాజ్యముచేసి మ్లేచ్ఛులతో జరిగిన "కురుక్షేత్ర" యుద్ధమున పృథ్వీరాజాదులతో సహా వీరమరణము నొందెను. (ఈ గ్రంథకర్తగారి "అగ్నివంశపు రాజులు" అను గ్రంథమును చూడుడు.) అటు పిమ్మట మహామ్మదీయులు, మహారాష్ట్రులు, బ్రిటిషువారు మొదలైనరాజ్యములు 1193 లగాయతు 1947 ఆగష్టు 15 తేదీవరకు జరిగియున్నవి. 1947 సం॥ర ఆగష్టునెల 15 తేదీనుండి స్వతంత్ర భారత మవతరించినది.

# ప్రసిద్ధ చారిత్రక కాలములు

కలిశక ప్రారంభం: క్రీ॥పూ॥3102ఫిబ్రవరి20 తేదీ2_27'_30" సెకండ్ల కాలమున

| | కలిశకం | క్రీ॥ పూ॥ |
|---|---|---|
| 1. భారతయుద్ధము కలిపూర్వం | 36 | 3138 |
| 2 యుధిష్ఠిర పట్టాభిషేకం | 36 | 3138 |
| 3. పరీక్షిత్తు జననం | 36 | 3138 |
| 4. మగధలో సోమాధిపట్టాభిషేకం [బార్హద్రధవంశం] | 36 | 3138 |
| 5. బృహద్బలుని పట్టాభిషేకం [అయోధ్యరాజు భారతయుద్ధమునకు పిమ్మట] | 36 | 3138 |
| 6. శ్రీకృష్ణ నిర్యాణం | | 3102 |
| కలిశకప్రారంభం | | 3102 |
| 7. కలిశకం | 1 | 3101 |

| | కలిశకం | క్రీ॥ పూ॥ |
|---|---|---|
| 8. పరీక్షిత్తు పట్టాభిషేకం | 1 | 310 |
| 9. జయాభ్యుదయ యుధిష్ఠిరశకం ["జయ" యను] పేరున భారతగ్రంథరచన ప్రారంభింపబడిన సం॥రం | 1 | 3101 |
| 10. యుధిష్ఠిరకాలము లేక లోకకాలము లేక సప్తర్షిశకము లేక లౌకికాబ్దప్రారంభం | 26 | 3076 |
| 11. పరీక్షిత్తు మరణం; జనమేజయ పట్టాభిషేకం | 60 | 3042 |
| 12. జనమేజయ దానశాసనపత్రం [ఇతని రాజ్యకాలం 29 సంవత్సరములో] [ఇండియన్ ఆంటిక్వెటి... 333-334 చూడుము] | 89 | 3013 |
| 13. ఆర్యభట్టు కాలము [జ్యోతిశ్శాస్త్రవేత్త] | 360 | 2742 |
| 14. గొప్ప వ్యాకరణవేత్తలైన పాణిని, ఉపవర్షణ, కాత్యాయనులున్నూ, సూత్రకర్తలైన బోధాయన, ఆపస్తంబ, హిరణ్యకేశులున్నూ, గొప్ప నైఘంటికుడైన వ్యాడి మొదలగు వారు కలి నాలుగవ శతాబ్దము లోపుననున్నట్లు కనుపించుచున్నది. ఇంకను పరిశోధనలు జరిపి సరియైన కాలనిర్ణయము చేయవలసియున్నది. | కలి ప్రా॥ నాల్గు శ॥ ల్లోగలదు. | 31 ల॥ 28 శ॥ ల్లోగలదు. |
| 15. మగధరాజులలో బార్హద్రథ వంశమంతరించుట, ప్రద్యోతవంశము రాజ్యమునకు వచ్చుట— | 970 | 2132 |
| 16. ప్రద్యోతవంశమంతరించుట; శిశునాగవంశము రాజ్యమునకు వచ్చుట— | 1108 | 1994 |
| ఈ వంశములో బుద్ధునితో సమకాలిక రాజులు — 1. క్షేమజిత్తు, 2. బింబిసార. 3. అజాతశత్రు. | 1210; 1250; 1288. | 1892; 1852; 1814 |

| | కలి | క్రీ॥ పూ॥ |
|---|---|---|
| 17. బుద్ధజననము. [క్షేమజిత్తు రాజ్యకాలములో] | 1215 | 1887 |
| బుద్ధుని సన్యాసము – [బింబిసారుని రాజ్యకాలములో] | 1244 | 1858 |
| బుద్ధ నిర్యాణము – [అజాతశత్రుని రాజ్యకాలములో] | 1295 | 1807 |
| 18. శిశునాగవంశ మంతరించుట – నంద వంశము-రాజ్యమునకు వచ్చుట— [రాజు మహాపద్మనంద] | 1468 | 1634 |
| 19. నందవంశాంతము; మౌర్య వంశ ప్రారంభం. [చంద్రగుప్త మౌర్య] | 1568 | 1534 |
| బిందుసార | 1602 | 1500 |
| అశోకపట్టాభిషేకం | 1630 | 1472 |
| 20. మౌర్యవంశాంతం; శుంగవంశ ప్రారంభము. [పుష్యమిత్రశుంగుడు] | 1884 | 1218 |
| 21 పతంజలికాలము | 1884 | 1218 |
| 22. శుంగవంశాంతః కాణ్వవంశారంభం– [వసుదేవకణ్వ] | 2184 | 918 |
| 23. కాణ్వవంశాంతం; ఆంధ్రవంశం [శ్రీముఖ] | 2269 | 833 |
| 24. మాలవగణశకము | 2377 | 725 |
| 25. సైరసుశకము (ఉత్తర హిందూస్థానమున వాడబడినది] | 2552 | 550 |
| 26. శ్రీశంకరుల జననం | 2593 | 509 |
| [సిద్ధినిబొందుట] | 2625 | 477 |

| | కలిశకం | క్రీ॥ పూ॥ |
|---|---|---|
| 27. శ్రీహర్షశకం – [ఉజ్జయినీరాజు] | 2645 | 457 |
| 28. ఆంధ్రరాజ్య విభాగము; గుప్తవంశ ప్రారంభం. [గుప్త చంద్రగుప్తుడు] | 2775 | 327 |
| 29. గుప్తశక ప్రారంభం | 2775 | 327 |
| 30. అలెగ్జాండరు దండయాత్ర | 2776 | 326 |
| 31. సముద్రగుప్తుని పట్టాభిషేకము | 2782 | 320 |
| 32. గుప్తరాజ్యాంతము | 3020 | 82 |
| 33. విక్రమార్కుని జననము; విక్రమార్కుని పట్టాభిషేకము [మాల్వారాజ్యము] | 3000<br>3020 | 101<br>82 |
| 34. విక్రమశక ప్రారంభం | 3044 | 57–58 |
| 35. వరాహమిహిర, కాళిదాసాది నవ రత్నములు. | 3044 | 57 |
| 36. క్రీస్తుశక ప్రారంభం | 3102 | క్రీ॥శ॥ప్రారభం |
| 37. శాలివాహన పట్టాభిషేకం శక ప్రారంభం | 3179 | క్రీస్తుశకం<br>78 |
| 38. భట్టోత్పలుడు [జ్యోతిశ్శాస్త్రవేత్త] | 3439 | 338 |

(కోట వెంకటాచలంగారి కలిశకవిజ్ఞానం ప్రథమభాగం 71 పుటచూడుడు.)

| | కలిశకం | క్రీ॥ శ॥ |
|---|---|---|
| 39. భాస్కరాచార్యులు – సిద్ధాంత శిరోమణి, లీలావతి గణితము, బీజగణితము, క్షేత్ర గణితము మొదలగు వాసిని వ్రాసిన గొప్ప జ్యోతిశ్శాస్త్ర, గణితశాస్త్రవేత్త. (ఈతనికాల ప్రశంస కోట వెంకటాచలంగారి కలిశకవిజ్ఞానం ప్రథమభాగం 72 పుట లగాయితు చూడుడు) | 3587 | 486 |

| | | కలిశకం | క్రీ॥ శ॥ |
|---|---|---|---|
| 40. | భోజమహారాజు పట్టాభిషేకము | 3739 | 638 |
| 41. | మహమ్మదు గోరీతో జరిగిన కురుక్షేత్ర యుద్ధము | 4295 | 1193 |
| 42. | భారత స్వాతంత్ర్యావతరణం | 5048 | 1947 |

భారతీయ సోదర చరిత్రకారులారా! మనము దైనికముగా యింతవరకు భారత చరిత్రలోపడిన పొరబాటులను తెలుసుకొని సవరించుకొందము భారతదేశ చరిత్రకు యెంత అపకారము చేయనగునో అంత అపకారము చేయబడినది. అది బుద్ధిపూర్వకమా లేక పొరబడుట వలననా యను విచారణ యిప్పుడు మనకనవసరము. ఇప్పుడు మన పండితులు గొప్ప పరిశ్రమచేసి లోగడ జరిగిన లోపములనన్నిటి చూపుచున్నారు ఇంతవఱకు మనకుండిన అభిప్రాయములను, ఆ తర్క-విధానమును వదలి భారత పండితుల నాదరించి వారివలన తెలిసికొందము! లేక మన స్వంతపరిశ్రమచే ప్రాచీన ఆర్షేయ విజ్ఞానమును భారత సాంప్రదాయానుసారముగా విమర్శించి చరిత్రలను మనము వ్రాసుకొందము.

శ్రుతి :— "ఉత్తిష్ఠత, జాగ్రత, ప్రాప్యవరాన్నిబోధత॥"

తా॥ "నిద్రనుండి లేవండి. మేలుకొనండి. శ్రేష్ఠులైన పండితులను పొంది బోధింపబడండి." అప్పుడు సత్యము మీకు గోచరించును. అని శ్రుతిమాత మనలను మేల్కొలుపుచున్నది. భారతజాతి గత శతాబ్దమంతయు వంచింపబడినది. అవమానింపబడినది. తెలిసికొని సవరించుకొందము. అన్యోన్య సహకారముతో భారతీయ వాఙ్మయమును పరిశోధించి యథార్థ భారత చరిత్రను వ్రాసుకొందము!

యీ దిగువ ప్రాచీన పురుషుల కాలములు కలిశకం 5050 [క్రీ॥ శ॥ 1950] వరకు లెక్క చూపబడినవి.

ఏడవ మనువు అగు ప్రస్తుతము జరుగుచుండిన వైవస్వతమన్వంతరములో రాబడిన ప్రసిద్ధపురుషుల కాలగణనము.

| అవతారములు | సౌరమానము ప్రకారం జరిగిన మానవ సం॥రములు |
|---|---|
| (1) మత్స్యావతార గతాబ్దాః | 12,49,02,467 |
| (2) కూర్మావతార గతాబ్దాః | 12,07,00,469 |
| (3) ఆది వరహావతార గతాబ్దాః | 10,58,05,872 |
| (4) శ్రీ నరసింహావతార గతాబ్దాః | 8,64,59,129 |
| (5) శ్రీ వామనావతార గతాబ్దాః | 4,40,45,050 |
| (6) శ్రీ పరశురామావతార గతాబ్దాః | 1,46,01,052 |
| (7) శ్రీ రామావతార గతాబ్దాః | 1,46,16,006 |
| (8) శ్రీ బలరామ కృష్ణావతార గతాబ్దాః | 5,050 |
| (9) త్రిపుర సంహారణార్థం రాబడిన బౌద్ధావతార గతాబ్దాః (గౌతమ బుద్ధుడు కాదు) | 46,31,064 |
| (10) రాబోవు కలికావతారమునకు జరుగవలసిన కాలము | 4,26,962 |

శ్రీ రామావతార గతాబ్దములు 1,25,36,984 అని కొన్ని చోట్ల కలదు. పొరపాటుబడి యుండవచ్చును. దీనినే పంచాంగములలో చూపుచున్నారు. ఇది విచారణీయము.

చక్రవర్తులు గతించిన కాలములు :

| | |
|---|---|
| (1) హరిశ్చంద్ర గతాబ్దాః | 11,98,24,232 |
| (2) నలచక్రవర్తి గతాబ్దాః | 10,36,17,039 |
| (3) పురుకుత్స గతాబ్దాః | 9,36,17,039 |
| (4) పురూరవ గతాబ్దాః | 8,16,12,011 |
| (5) సగర గతాబ్దాః | 5,10,28,458 |
| (6) శిబి గతాబ్దాః | 4,14,80,314 |

గతించిన రాజుల కాలములు :

| | |
|---|---|
| (1) అంబరీష గతాబ్దాః | 4,08,31,044 |
| (2) గయరాజ గతాబ్దాః | 3,99,20,454 |
| (3) పృథురాజ గతాబ్దాః | 3,22,09,880 |
| (4) యయాతి గతాబ్దాః | 3,10,31,040 |
| (5) శశిబిందు గతాబ్దాః | 2,70,28,807 |
| (6) మాంధాత గతాబ్దాః | 2,34,40,177 |
| (7) భగీరథ గతాబ్దాః | 2,15,05,287 |
| (8) భరతరాజ గతాబ్దాః (దుష్యంతునికొడుకు) | 1,56,04,043 |
| (9) దిలీప గతాబ్దాః | 1,56,08,977 |
| (10) రావణ గతాబ్దాః | 1,46,27,042 |
| (11) కార్తవీర్యార్జున గతాబ్దాః | 1,25,47,153 |
| (12) రంతిదేవ గతాబ్దాః | 1,20,37,214 |
| (13) నహుషాబ్దాః | 1,12,25,500 |
| (14) ఇంద్రద్యుమ్న గతాబ్దాః | 49,894 |

సమాప్తము

"తత్సత్"

## సవరణ

76 పుటలో 10 పంక్తిలో

రాజులసంఖ్య 9 కి బదులు 2 అని చదువవలెను.

# కలియుగరాజ వంశములు

## అనుబంధము

*

## అగ్నివంశపు రాజులు

అగ్ని వంశములు నాలుగు. (1) ప్రమర, (2) పయహాని, (3) శుక్ల, (4) పరిహార అను నాలుగువంశములవారు కలి 2710 సం॥ రం (క్రీ. పూ. 392 సం॥) లగాయతు కలి 4295 సం॥ (క్రీ॥ శ. 1193 సం॥) వఱకును సమకాలికులుగా ఆసేతుహిమాచలముగా గల యావద్భారత దేశమును పరిపాలించియుండిరి. అందు ప్రమరవంశపు రాజులలో ప్రముఖులగు వారలు (1) విక్రమాదిత్యుడు. కలి 3020 సం॥ లగాయతు కలి 3120 సం॥ వఱకు (క్రీ. పూ. 82 లగాయతు క్రీ శ. 18 వరకును), శాలివాహనుడు క్రీ॥ శ. 78 సం॥ లగాయతు క్రీ. శ. 138 వరకును భోజరాజు క్రీ. శ. 637_693 సం॥ వఱకును రాజ్యము చేసియుండిరి. ఆ ప్రకారము మిగత మూడు అగ్నివంశపు రాజులును వీరికి సమకాలికులుగా రాజ్యము చేసియుండి క్రీ. శ. 1193 సం॥ రమున మహమ్మదీయులతో జరిగిన స్థానేశ్వర యుద్ధమున యీ నాలుగు వంశముల రాజులును నశించిరి. అట్టి అగ్నివంశముల రాజవంశావళి కూడ నిందు చూపుట భావ్యమని తలచి దిగువ ఆ వంశావళి నిచ్చుచుంటిమి.

## ప్రమరవంశపు రాజులు

| నెంబరు | రాజుల పేర్లు | రాజ్యం చేసిన కాలము | కలిశకం సం॥ రములు | | క్రీస్తుశక సం॥ రములు |
|---|---|---|---|---|---|
| 1. | ప్రమర | 6 | 2710 · 2716 వరకు | క్రీ॥ పూ. | 392—386 |
| 2. | మహామర | 3 | 2716_2719 | ” | 386—383 |
| 3. | దేవాపి | 3 | 2719_2722 | ” | 383—380 |
| 4. | దేవదూత | 3 | 2722_2725 | ” | 380—377 |

| నెంబరు | రాజులపేర్లు | రాజ్యం చేసిన కాలము | కలిశకం సం॥రములు | | క్రీస్తుశక సం॥రములు |
|---|---|---|---|---|---|
| 5. | ఉజ్జయినీనుండి పోయి శ్రీశైలములో రాజ్యం చేసిన రాజులకాలము | 195 | 2725–2920 | ,, | 377—182 |
| 6. | గంధర్వసేనుడు | 50 | 2920–2970 | ,, | 182—132 |
| 7. | శంఖమహారాజు | 30 | 2970–3000 | ,, | 132—102 |
| | శంఖునిమరణానంతరం తిరిగి గంధర్వసేనుడు | 20 | 3000–3020 | ,, | 102— 82 |
| 8. | గంధర్వసేనుని రెండవ కుమారుడు "విక్రమాదిత్య" జననం కలి 3001 సం॥ పట్టాభిషేకం ఉజ్జయినీలో 3020 సం॥ | 100 | 3020–3120 | క్రీ॥ శ. 82– | క్రీ.శ. 19 |
| 9. | దేవభక్త | 10 | 3120–3130 | ,, | 19— 29 |
| 10, | చెప్పబడనిరాజు | 49 | 3130–3179 | ,, | 29— 78 |
| 11. | శాలివాహనుడు | 60 | 3179–3239 | ,, | 78—138 |
| 12. | శాలిహోత్ర | | | | |
| 13. | శాలివర్ధన | | | | |
| 14. | సుహోత్ర | | | | |
| 15. | హావిర్హోత్ర | | | | |
| 16. | ఇంద్రపాల | 556 | 3239–3795 | ,, | 138–693–694 |
| 17. | మాల్యవాన్ | | | | |
| 18. | శంభుదత్త | | | | |
| 19. | భౌమరాజు | | | | |
| 20. | వత్సరాజు | | | | |
| 21. | భోజరాజు | | | | |

| | | | |
|---|---|---|---|
| 22. శంభుదత్త<br>23. బిందుపాల<br>24. రాజపాల<br>25. మహీనర<br>26. సోమవర్మ<br>26. కామవర్మ<br>28. భూమిపాల లేక వీరసింహ | 300 | 3795–4095 | 693—993 |
| 29. రంగపాల<br>30. కల్పసింహ<br>31. గంగసింహ | 200 | 4095–4295 | 993—1193 వరకు |

## చయుహాని వంశపు రాజులు

1. వయుహాని
2. తోమర(తోమరునిసోదరుడు)
3. సామలదేవ
4. మహాదేవ
5. అజయ
6. వీరసింహ
7. బిందుసుర
8. విక్రమ (వీరవిషాంతక)
9. మాణిక్యః
10. మహాసింహః
11. చంద్రగుప్తః
12. ప్రతాప (రెండవ చంద్రగుప్త)
13. మోహన
14. శ్వేతరాయ
15. నాగవాహ
16. లోషాధర
17. వీరసింహ
18. విబుధః
19. చంద్రరాజ
20. హరిహార
21. వసంతః
22. బలాంగః
23. ప్రమథ
24. అంగరాయ
25. విశాలః
26. సారంగదేవ
27. మంత్రదేవ
28. జయసింహ (ఈతడార్యావర్తమును జయించెను.)
29. ఆనందదేవ
30. సోమేశ్వరః
31. పృథ్వీరాజు

## చాళుక్య వంశపు రాజులు

1. శుక్లః లేక చాళుక్య
2. విష్వక్సేనః
3. జయసేనః
4. విశేనః
5. మదసింహః
6. సింధువర్మః
7. సింధుద్వీపః
8. శ్రీపతిః
9. భుజవర్మః
10. రణవర్మః
11. చిత్రవర్మః
12. ధర్మవర్మః
13. కృష్ణవర్మః
14. ఉదయః
15. వాప్యకర్మః
16. గుహిలః
17. కాలభోజః
18. రాష్ట్రిపాలః
19. జయపాలః
20. వేణుకః
21. యశోవిగ్రహః
22. మహీచంద్రః
23. చంద్రదేవః
24. మందపాలః
25. కుంభపాలః లేక వైశ్యపాలః
26. దేవపాలః. ఈతడు అనంగ భూపతి కుమార్తెయైన "చంద్రకాంతిని" వివాహమాడెను. ఈ దంపతులకు జయచంద్రుడు, రత్నఖానలు డను యిద్దరు కుమారులు గలిగిరి. రత్నఖానలుని కుమారుడు లక్ష్మణుడు యుద్ధమందు నిహతుడయ్యెను.

27. జయచంద్రః ఈతడే రాణీసంయుక్తాదేవికి తండ్రి. పృథ్వీరాజుకు వైరి. మహమ్మదీయులతో కలిసి పృథ్వీరాజను సంహరించిన పిమ్మట మహమ్మదీయులు తన రాజ్యముమీదకు రాగా నదీజలములబడి మరణించెను.

## పరిహార వంశపు రాజులు

(కలి 2710_4295 వరకు)

(కలింజరపురం – వంగదేశం)

1. పరిహార
2. గౌరవర్మ
3. ఘోరవర్మ
4. సువర్ణ
5. రూపణ
6. కారవర్మ

7. భోగవర్మ
8. కాలివర్మ (ఇతడు "కలికాతా" నగర నిర్మాణ మొనర్చెను)
9. కౌశిక
10. కాత్యాయన
11. హేమవతః
12. శివవర్మ
13. భావవర్మ
14. రుద్రవర్మ
15. భోజవర్మ ("భోజవర్మఅరణ్య ప్రదేశమున "భోజరాష్ట్ర మును" నిర్మించి పాలించెను)
16. గవవర్మ
17. వింధ్యవర్మ (తమ్మునికి రాజ్య మిచ్చి తాను వంగదేశమును పాలించెను)
18. సుఖసేన
19. బలాక
20. లక్ష్మణ
21. మాధవ
22. కేశవ
23. శూరసేన
24. నారాయణ
25. శాంతివర్మ (గంగా తీరంలో "శాంతిపురం" నిర్మించినాడు)
26. నదీవర్మ (గౌడదేశమును జయించి "పూరీ" నగరమును నిర్మించెను. ఈతని నుండి యీ వంశముకు "గంగవంశ" మని పేరు గలిగెను.) (భవిష్య3-4-4-27)
27. సారంగదేవ
28. గంగదేవ
29. అనంగ భూపతి
30. మహీపతి I.,
31. రాజేశ్వర
32. నృశింహ
33. రెండవ కలివర్మ, (ఈతడు మహారాష్ట్రమునుజయించెను. (3-4-4-32)
34. ధృతివర్మ
35. మహీపతి II

## వైశ్య వంశపు రాజులు

(థానేశ్వరము - రాజధాని)

1. పుష్పభూతి (ఈతనికి పిమ్మట
2. } రాబడిన రాజులు
3. } ముగ్గురు పేర్లు
4. } తెలియలేదు)
5. నరేంద్రవర్ధన
6. తెలియదు
7. ,,
8. ప్రభాకర వర్ధన
9. రాజ్యవర్ధన (ఈతని సోదరుడు)
10. హర్షవర్ధన శిలాదిత్య

పై వైశ్యవంశపు రాజులు పదిమందియు సగటున రాజు 1కి 30 సం॥ రములుగా తీసుకొనిన పదిమంది రాజులు 300 సం॥రము లైనను రాజ్యము చేసియుందురు. క్రీ॥ శ. నాలుగవ శతాబ్ద మధ్యనుండి క్రీ॥ శ. ఏడవ శతాబ్దము మధ్యవరకు రాజ్యముచేసి యుండినట్లెంచవచ్చును.

## పల్లవ, శక, కుషాను హూణరాజులు

ఇటీవల దొరుకబడిన తక్షశిలలోని శాసనములు, నాణెములను బట్టి కుషానురాజు లిచ్చట రాజ్యములు చేసినటుల తెలిసికొని వారిని భారతదేశ చరిత్రలో నెక్కించిరి. పశ్చిమోత్తర భారతమున వారు అల్పరాజ్యములను సంపాదించి అత్యల్పకాలము రాజ్యములు చేసిన రాజులై యున్నారు. కాని పాశ్చాత్య చరిత్రకారులు వారిని గొప్ప రాజులుగా ప్రదర్శించి భారత చరిత్రలో వారికి ప్రత్యేకస్థానమిచ్చి వారి చరిత్రలను విశేషించి పెంచి వ్రాసియుండిరి. గొప్ప భారత చక్రవర్తులై శకస్థాపకులైన విక్రమాదిత్య, శాలివాహను లసలే పుట్టలేదనియు అట్టి వారాకాలమున లేరనియు వాదించుచు వారిచే స్థాపితమైన విక్రమ శాలివాహనశకములను యీ కుషానురాజుల కంటగట్టి తప్పుచరిత్రలను వ్రాసియుండిరి. ఈ కుషానురాజు లెవరైనదియు, ఎచ్చటనుండి వచ్చినదియు, ఏ కాలములో నుండినదియు వీరికి సత్యముగా తెలియదు. వీరిచరిత్ర యనునదంతయు ఊహాగానమై యున్నది. శాసనములలో పేర్లుమాత్రముగలవు. ఆశాసనములలో వేయబడిన తేదీలేశకమునకు సంబంధించినవో తెలియవు. అందు వేయబడినవి వారిరాజ్యకాలముకు సంబంధించిన సం॥రములుగాని లేక ఆకాలమున పశ్చిమోత్తర భారతమున (ఇప్పటి ఆఫ్‌గనిస్థానము) వాడబడిన శకముగాని కావచ్చును. అది పారసీకరాజైన సైరసుశకమై యున్నది. వరాహమిహిరుడు తన బృహత్సంహితలో సైరసుశకమును వాడియున్నాడు. కుషానురాజుల శాసనములలోని అంకెలు సైరసుశకముకు సంబంధించినవిగా తీసుకొనిన యీ కుషానురాజులు క్రీ॥పూ॥ అయిదు, నాలుగు, మూడు, రెండు శతాబ్దములలోనుండి యుండవలెను. విక్రమ, శాలివాహనశకముల

నిగరగొట్టుటకుగాను యీ కుషానురాజులను పాశ్చాత్య పండితు లిటీవలి కాలముకు తెచ్చి క్రీ॥ పూ. 58 సం॥రములోని విక్రమశకము మొదటి ఎజెస్ శకమనియు, శాలివాహనశకము కానిష్కుని శకమనియు స్థిరపరచుచు తమ మామూలు వ్రాతధోరణి ప్రకారము సందేహ వాక్యములతో చెప్పియుండిరి. (విక్రమశకము మొదటి ఎజెస్ అను రాజుచే స్థాపింపబడి యుండవచ్చుననియు క్రీ. శ. 78 సం॥లోని కాని ష్కునిశకము ఇటీవల శాలివాహనశకముగా పేరు తబ్దీలు అయివుండ వచ్చుననియు యీ మొదలుగాగల సందేహవాక్యములతో వ్రాసి యుండిరి.) ఈ వ్రాతలరహస్యమంతయు విక్రమాదిత్య, శాలివాహనులు లేరని ప్రచారము చేయుటకై యున్నది. అందు నిమిత్తం యీ కుషాను రాజుల కాలము క్రీస్తుకు పూర్వాపరములగల మొదటి శతాబ్దములలోనికి తేబడినది.

## పల్లవ, శక, కుషానురాజుల వివరములు

| | |
|---|---|
| 1. పశ్చిమోత్తర భారతమున అల్పరాజ్యమును పరిపాలించిన పల్లవరాజు "గాండోఫరెన్సు" (Gondopharnes) | క్రీ॥ పూ॥ 489–463 |
| 2. ౧ శకరాజు "పకోర్సు" (Pacores)<br>కుషానురాజులు<br>౨ "కుజూలాకాడ్ పాసిస్"<br>3 "విమకాడ్ పాసిస్" యీ ముగ్గురురాజులు. | 463–430 మధ్య కాలము |
| 3. "కానిష్కుడు" రాజ్యపట్టాభిషేకము రాజ్యకాలము. | క్రీ॥ పూ॥ 480 సం॥ లగాయతు 370 స॥ల వరకు |

4. నాసికయందుగల శకరాజులు (ఇద్దరు "గౌతమీపుత్ర శాతకర్ణి" వలన నాశనము చేయబడినవారు) (1) భూమక (2) నహపాన అనెడిపేర్లు గలవారు. (వీరికి మహారాష్ట్రములోని "మహాక్షాత్రపులని పేరు) నహపానుడు గౌతమీ పుత్రశాతకర్ణి వలన నాశనము చేయబడి ఆ రాష్ట్రము ఆంధ్రసామ్రాజ్యములో కలుపుకొన బడినకాలము — క్రీ॥ పూ॥ 414 సం॥

5. పశ్చిమోత్తర భారతములోను, పంజాబులోను మొదట రాజ్యమును స్థాపించిన పార్థియను రాజు "మాస్". ఈతని శాసనములో 78 అని వేయబడి యున్నది. "పార్థియా" యను రాష్ట్రము పారశీకము లోనిది. పారశీకచక్రవర్తి "సైరసుదిగ్రేటు" అను వాని శకమచ్చటాకాలమున వాడుకలోనున్నది. ఆదేశస్థుడైనశకరాజు "మాస్" ఆశకమునే తన పరిపాలనలో వాడు కొనుట స్వాభావికము. కనుక "మాస్" అను శకరాజుచే పశ్చిమభారత రాజ్యమున వేయబడిన శాసనములోని 78 సం॥రము "సైరసు" శకమనుట కెట్టి సంశయములేదు. సైరసు శక ప్రారంభము క్రీ॥ పూ. 550 నుండి 78 తీసివేయగా క్రీ॥ పూ. 472 సం॥రం అగును. ఇది "మాస్" పరిపాలనా కాలము. — క్రీ॥ పూ. 472 సం॥

ఆతని తరువాత యీ వంశములో "ఎజెస్" ఆతనికి పిమ్మట "ఎజిలైజెస్" అనువార లిద్దరును రాజ్యచేసి యుండిరి. "ఎజెస్" చీర్ తోపు శాసనములోని 136 సం॥రం (550–136 =) — క్రీ॥ పూ. 414 సం॥

6. ఉజ్జయినీలో రాజ్యము చేసిన మహాక్షాత్రపులు.

"చాస్తన" అను శకరాజు మాల్వారాష్ట్రమునకు రాజధానియైన "ఉజ్జయిని" యందు రాజాయెను. ఈతడు "రెండవ కాడ్‌పాసిస్"కు సామంతుడుగానుండె నని యెంచబడినది. రెండవ కాడ్‌పాసిస్ కాలము — క్రీ॥ పూ. 440 సం॥ లగాయతు 420 సం॥ వరకు

7. ఈ శకవంశపు రాజులు

సామోతిక అనువాని కుమార్డు.

1. చాస్తన
2. జయదమన
} క్రీ పూ. 440—420

3. రుద్రదమన

ఇందు మొదటి యిద్దరు హెచ్చుకాలము రాజ్యము చేసియున్నట్లు కనుపించదు. వారు యుద్ధములో చంపబడినట్లు తోచుచున్నది. మూడవవాడైన "రుద్రదమనుడు క్రీ॥ పూ. 420 సం॥రం ఆ ప్రాంతముల రాజ్యమునకు వచ్చియున్నాడు. ఈతడు కానిష్కునికి సమకాలికుడై ఆతనికి సామంతుడుగా నుండి యున్నాడు. కుషాను రాజ్యము బలహీనము కాగానే యీతడు స్వతంత్రుడయ్యెను. — క్రీ. పూ. 420—360

గిర్నారులోని అశోకుని శాసనములు గల రాతిబండమీద రుద్రదమనుడు సుదర్శన సాగరమును మరమ్మతు చేసినట్లొక శాసనమును (క్రీ॥పూ. 370సం॥) స్కందగుప్తునివలన మరమ్మతు చేయబడినట్లొక శాసనమును (క్రీ. పూ. 190 సం॥) గలవు. ఈ వంశములోని చివరరాజు రెండవ చంద్రగుప్తునివలన క్రీ॥ పూ. 245 ఆ ప్రాంతముల చంపబడి మాల్వా రాష్ట్రము గుప్త సామ్రాజ్యములో చేర్చుకొనబడినది — క్రీ॥ పూ. 245 సం॥

8. హూణరాజులు —

| | |
|---|---|
| ౧. తోరమానుడు యీతని కుమార్డు.<br>౨. మాత్రిచేత<br>వీరిద్దరు అతి స్వల్పకాలము మాత్రమే రాజ్యము చేసియుండిరి వీరి చివర కాలము. | క్రీ॥ పూ. 153 సం॥ |
| మిహిర గులుడు (క్రీ॥ పూ. 175 సం॥). ఇతనిని యశోధనుడను రాజు జయించి లోబరచుకొనెను. | క్రీ॥ పూ. 136 సం॥ |

—◦◦◦—